# అంతరిక్షంలో సోవియట్ మానవుడు



సోవియట్ భూమి :: అనుబంధం
సంచిక 10, మే 1961

3



# విషయ సూచిక

# మానవాళి అభివృద్ధిలో అద్భుతమైన అధ్యాయం

## సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గం, సోవియట్ దేశ ప్రభుత్వమూ

## సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీకీ, ప్రజలకూ, సకల దేశాల ప్రజలకూ, ప్రభుత్వాలకూ, అభ్యుదయ కాముక మానవకోటి అంతటికీ చేసిన విజ్ఞప్తి

మహత్తర ఘటన జరిగింది. చరిత్రలో తొలి సారిగా మానవుడు రోదసి లోనికి యాత్ర చేశాడు.

ఏప్రిల్ 12, 1961న మాస్కో కాలం 9 గంటల 7 నిమిషాలకు ఒక మనిషితో "ఓస్తోక్"అన్న ఉపగ్రహ రోదసీ నౌక లేచి, భూమికి ప్రదక్షిణ చేశాక, మా మాతృభూమి—సోవియట్ల భూమి యొక్క పవిత్రమైన నేలకు తిరిగి వచ్చింది.



ప్రపంచపు ప్రథమ రోదసీ నౌకా చోదకుడు, సోవియట్ మేజర్ యూరీ గగారిన్

రోదసి లోనికి చొచ్చుకు పోయిన తొలి మానవుడు, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య పౌరుడు :

ప్రకృతి శక్తుల పైని మానవుని అపూర్వ విజయమిది, వైజ్ఞానిక సాంకేతిక శాస్త్రాల మహత్తర విజయమిది, మానవుని మేధా శక్తి విజయ

7

మిది. మానవుని రోదసీ యాత్రలకు ప్రారంభం జరిగింది. చరిత్రలో నిలిచిపోయే యీ మహత్తర కార్యం, సోవియట్ ప్రజల ఉపజ్ఞకూ, సోషలిజం మహత్తర శక్తికీ తార్కాణంగా వుంది.

మహదానందంతోనూ, సహేతుకమైన గర్వభావంతోనూ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గమూ, సోవియట్ ప్రభుత్వమూ సోషలిజం జయప్రదమైన మా దేశం మానవజాతి ప్రగతి కోసం ఒక నవ శకాన్ని ప్రారంభించిందని భావిస్తున్నాయి.

గతంలోని వెనుకబడిన జారిస్టు రష్యా, ప్రగతి కొరకు కృషిలో యిటువంటి విజయాలను, సాంకేతికంగా ఆర్థికంగా యెక్కువ అభివృద్ధి చెందిన దేశాలతో పోటీచేయ గలనని కలలోకూడా ఎన్నడూ అనుకోలేదు.

కార్మికవర్గం అభిమతానుసారంగా, ప్రజల అభిమతానుసారంగా, లెనిన్ ఆధిపత్యాన కమ్యూనిస్టుల పార్టీచే ఉత్తేజాన్ని పొంది మా దేశం, వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధిలో అపూర్వమైన విజయాలు గాంచిన మహత్తర సోషలిస్టు రాజ్యంగా పరివర్తనం చెందింది.

1917 అక్టోబరులో కార్మిక వర్గం అధికారాన్ని స్వాయత్తం చేసుకున్నప్పుడు, చాలమంది హృదయ శుద్ధిగలవారు సైతం, అది దేశ పాలనను సాగించగలుగుతుందా అనీ, కనీసం అప్పటి ఆర్థిక వైజ్ఞానిక సాంకేతిక స్థాయినైనా నిర్వహించగలుగుతుందా అనీ సందేహించారు.

ఇప్పుడు కార్మిక వర్గమూ, సోవియట్ సమిష్టి క్షేత్రాంగమూ, సోవియట్ బుద్ధి జీవులూ, సోవియట్ ప్రజలు యావన్మందీ గణనీయమైన వైజ్ఞానిక సాంకేతిక విజయాన్ని ప్రపంచ ప్రజలందరికీ కళ్ళ ముందు చూపారు. మా దేశం ప్రపంచంలోని యితర దేశాలన్నిటినీ మించి, రోదసీ ప్రవేశానికి తొలిసారిగా బాట వేసింది.

సోవియట్ దేశం మొదటిసారిగా అంతర్ ఖండ బాలిస్టిక్ రాకెట్‌ను పంపింది, మొదటిసారిగా కృత్రిమ భూ ఉపగ్రహాన్ని పంపింది, మొదటిసారిగా చంద్ర మండలానికి రోదసీ నౌకను పంపింది, కృత్రిమ సూర్యోపగ్రహాన్ని మొదటిసారిగా సృష్టించింది, శుక్రగ్రహం వేపుకు రోదసీ నౌకను

పంపించింది. ప్రాణులతో బాటుగా సోవియట్ ఉపగ్రహ రోదసీ నౌకలు ఒకదాని తరవాత ఒకటిగా రోదసిలోనికి వెళ్ళి, తిరిగి భూమిమీదికి వచ్చాయి.

రోదసి పైని మా విజయాలకు పరాకాష్ఠ, రోదసీ నౌకలో ఒక సోవియట్ పౌరుని జయప్రదమైన భూప్రదక్షిణ.

కార్మిక వర్గానికీ, సోవియట్ రైతాంగానికీ, సోవియట్ మేధావులకూ, సోవియట్ ప్రజలు యావన్మందికీ జేజేలు!

సోవియట్ విజ్ఞాన శాస్త్ర వేత్తలకూ, ఇంజనీర్లకూ, సాంకేతిక నిపుణులకూ—రోదసీ నౌక సృష్టికర్తలకు జేజేలు!

ప్రథమ రోదసీ యాత్రికుడు కామ్రేడ్ యూరీ అలెక్సియేవిచ్ గగారిన్‌కు—తొలి రోదసీ విజేతకు జేజేలు!

కమ్యూనిజాన్ని నిర్మిస్తోన్న సోవియట్ ప్రజలమైన మనము మొదటి సారిగా రోదసిలోనికి చొచ్చుక వెళ్ళి గణుతి కెక్కాము. రోదసి పైని యీ విజయాలను మన ప్రజల విజయాలుగానే కాకుండా, యావత్తు మానవజాతి విజయాలుగా పరిగణిస్తున్నాము. భూమిమీది ప్రజలందరి ప్రగతి సుఖ సంతోషాల పేరిట, వాటిని సకల ప్రజల సేవకు మేము సంతోషపూర్వకంగా సమర్పిస్తున్నాము. మా విజయాలనూ, మేము కనుగొన్న విషయాలనూ యుద్ధం కొరకు కాకుండా, ప్రజల శాంతి భద్రతల కొరకు సమర్పిస్తాము.

వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధి ప్రకృతి శక్తులను లోబర్చుకోవడానికి, వాటిని మానవ శ్రేయస్సుకు ఉపయోగించడానికీ అపారమైన అవకాశాలను కల్పిస్తుంది. ఇందు నిమిత్తం, అన్నిటికంటె ముఖ్యంగా శాంతిని నెలకొల్పడం అవసరం.

ఈ మహత్తర దినాన, సకలదేశాల ప్రజలకూ, ప్రభుత్వాలకూ శాంతి కొరకు విజ్ఞప్తి చేస్తున్నాము.

సకల ప్రజలూ, జాతి, తెగ, రంగు, మతం, సాంఘిక విభాగాల ప్రసక్తి లేకుండా, ప్రపంచమంతటా సుస్థిర శాంతిని నెలకొల్పేందుకు సర్వవిధాలా పాటుపడుతారు గాక. అమితాయుధోత్పత్తి పోటీని అంతంచేద్దాం! కచ్చితమైన అంతర్జాతీయ నియంత్రణతో సార్వత్రిక సంపూర్ణ నిరాయుధీ



ప్రపంచానికి ప్రథమ రోదసీ యాత్రికుడు, సోవియట్ పౌరుడు
మేజర్ యూరీ గగారిన్

కరణను సాధించాము ! పవిత్రమైన శాంతి రక్షణాశయానికి యిది గొప్పగా తోడ్పడుతుంది.

మన మాతృదేశ మహత్తర విజయం, కమ్యూనిజం నిర్మాణంలో నూతన వీరోచిత కృత్యాలకు సోవియట్ ప్రజలందరినీ ఉత్తేజపర్చుతుంది !

శాంతి అభ్యుదయ, మానవ సౌఖ్యాల పేరిట నూతన విజయాలకు సాగిపొండి !

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ,
సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గం,
సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య
మంత్రి వర్గం.

క్రెమ్లిన్, మాస్కో,
ఏప్రిల్ 12, 1961.

# ప్రపంచపు మొదటి రోదసీ యాత్రికుడు మేజర్ యూరీ అలెక్సియేవిచ్ గగారిన్‌కు

ప్రియమైన యూరీ అలెక్సియేవిచ్,

ఈ అత్యంత వీరోచితమైన కృత్యాన్ని సాధించినందుకు — ఉపగ్రహ రోదసీ నౌక "ఓస్తాక్" పైని తొలిసారిగా రోదసిలోనికి వెళ్ళినందుకు, నేను ఎంతో సంతోషంతో మిమ్ము అభిమానపూర్వకంగా అభినందిస్తున్నాను.

సోవియట్ ప్రజలు యావన్మందీ అద్భుతమైన మీ వీరకృత్యాన్ని మెచ్చుకుంటారు. ఇది మానవ సేవలో ధైర్య, పరాక్రమ, వీరత్వాలకు ఒక దృష్టాంతంగా యుగయుగాలు జ్ఞాపకం వుండిపోతుంది.

మీ యాత్ర మానవజాతి చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని, రోదసిని జయించడంలో ఒక నూతనాధ్యాయాన్ని రచించి, సోవియట్ ప్రజల హృదయాలలో మహదానందాన్నీ, తమ సామ్యవాద మాతృభూమి పట్ల గర్వ భావాన్నీ నింపింది.

రోదసీ యాత్ర చేసి, మన భూమికి సుఖంగా తిరిగివచ్చిన సందర్భాన మిమ్ములను నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. మాస్కోలో మిమ్ములను కలుసుకోగలనని ఆశిస్తూ మిమ్ములను కౌగలించుకుంటున్నాను.

ఏప్రిల్ 12, 1961.

యన్. క్రుశ్చెవ్

# రోదసీ నౌక "ఓస్తోక్" లో ప్రపంచానికి తొలిసారిగా మానవుని రోదసీ యాత్ర జయప్రదం కావడానికి తోడుపడిన విజ్ఞాన శాస్త్రజ్ఞులకూ, ఇంజినీర్లకూ సాంకేతిక విషయజ్ఞులకూ, కార్మికులకూ, అన్ని సంఘాలకూ, సంస్థలకూ, ప్రథమ సోవియట్ రోదసీ యాత్రికుడు కామ్రేడ్ యూరీ అలెక్సియేవిచ్ గగారిన్‌కూ

ప్రియమైన కామ్రేడ్స్ !

మిత్రులారా, తోడి దేశీయులారా !

మన దేశ ప్రజలు ఆనందదాయకమైన, ఉత్తేజకరమైన సంఘటనా ఫలితాన్ని అనుభవిస్తున్నారు. 1961 ఏప్రిల్ 12న మానవ చరిత్రలో తొలిసారిగా, మన దేశమైన సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య "ఓస్తోక్" అన్న రోదసీ నౌకలో జయప్రదంగా మానవ యాత్రను జరిపించింది.

రోదసిలోనికి సోవియట్ మానవుని యాత్ర మన ప్రజల సృజనాత్మక ప్రతిభకు ఘనమైన ఫలితం; కమ్యూనిజం నిర్మాతలైన సోవియట్ ప్రజల స్వేచ్ఛాయుతమైన, ఉత్తేజకర కృషిఫలితం. గతకాలపు రష్యన్, ప్రపంచ విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల ప్రఖ్యాత పండితులకల, మన ప్రజల మహత్తర పుత్రుడు కాన్‌స్తాంతిన్ ఎదువర్దొవిచ్ త్సియొల్కొవ్‌స్కీ యావజ్జీవితమూ కన్న కల, మన యీ వీర దినాలలో నిజమయ్యింది. ప్రపంచ శాస్త్ర విజ్ఞాన,

సంస్కృతుల నిధికి సోవియట్ ప్రజలు చేసిన గొప్ప సేవ యిది. సాటిలేని యీ సోవియట్ విజయాన్ని, మానవకోటి కృతజ్ఞతతో కీర్తిస్తుంది. రోదసి లోనికి సోవియట్ పౌరుని వీర యాత్ర, ప్రపంచ చరిత్రలో నూతన శకోదయ మవుతుంది. మానవుని తరతరాల కల నిజమయ్యింది.

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గమూ, సోవియట్ దేశ మంత్రివర్గమూ, మన యశోవంతమైన కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వం, యావన్మంది సోవియట్ ప్రజల పక్షాన ప్రపంచంలో తొలిసారిగా మానవుని రోదసీ యాత్రను జయప్రదం చేయడానికి, మానవ మేధస్సు, కృషి మహత్తర విజయాన్ని సాధించడానికి పాటుపడిన అందరు విజ్ఞాన శాస్త్రజ్ఞులనూ, డిజైనర్లనూ, సాంకేతిక విషయజ్ఞులనూ, కార్మికులనూ, అన్ని సంఘాలనూ, సంస్థలనూ హృదయపూర్వకంగా అభినందిస్తున్నాయి.

ప్రియమైన యూరీ అలెక్సియేవిచ్ గగారిన్, యీ మహత్తర కార్యాన్ని, రోదసి లోనికి తొలి యాత్రను సాధించినందుకు మిమ్మలను మేము హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాము.

యావత్ప్రపంచ కార్మిక వర్గ మహానేత, బోధకుడూ అయిన వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ నాయకత్వాన కమ్యూనిస్టుపార్టీ 1917అక్టోబరులో అవతరించిన మన స్వతంత్ర, ప్రతిభాయుత, శ్రమశీలురైన ప్రజలు చరిత్రను నిర్మిస్తూ, సామాజిక జీవిత రంగాలన్నిటిలో నవ్య సోషలిస్టు వ్యవస్థవల్ల లభించే గొప్ప లాభాలను యిప్పుడు ప్రపంచానికి చాటి చెప్పుతున్నారు.

సర్వతోముఖ కమ్యూనిస్టు సమాజ నిర్మాణం కోసం బ్రహ్మాండమైన కార్యక్రమాన్ని జయప్రదంగా అమలు జరపడం వల్ల; విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల, సంస్కృతీయొక్క క్రమక్రమ ప్రగతికొరకూ, సోవియట్ ప్రజల శ్రేయస్సు కొరకూ కమ్యూనిస్టుపార్టీ, దాని లెనినిస్టు కేంద్ర కమిటీ, నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్ నాయకత్వాన సోవియట్ప్రభుత్వమూ తీసుకునే నిరంతర శ్రద్ధ వల్లా మానవుని రోదసీ యాత్ర సాధ్యపడింది.

ప్రపంచానికి మొదటి సోవియట్ కృత్రిమ భూ ఉపగ్రహం ఎగుర

నేతకూ, రోదసిలోనికి జయప్రదమైన మానవ యాత్రకూ మధ్యకాలం నాలుగేళ్ళకు తక్కువ.

పట్టుదలగా, స్వార్థరహితంగా పాటుపడి సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లు, సాంకేతిక విషయజ్ఞులూ, కార్మికులు విశ్వం లోతులకు మార్గాన్ని మానవ ప్రతిభకు చూపారు. వారు దీనిని ప్రపంచ శాంతి పేరిట, సకల ప్రజల సౌఖ్యం పేరిట చేశారు.

రోదసిలో మానవుని తొలియాత్ర, యితోధిక ప్రగతి పేరిట, ప్రపంచ శాంతి పేరిట సకల సోవియట్ ప్రజలకూ నూతనోత్తేజాన్ని, పరాక్రమాన్ని యిస్తుంది.

సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులకు, డిజైనర్లకు, ఇంజనీర్లకూ, సాంకేతిక విషయజ్ఞులకు, కార్మికులకూ, రోదసీ విజేతలకూ జేజేలు !

మన ప్రజలకు, సృష్టికర్తలైన మన ప్రజలు, విజేతలైన మన ప్రజలకు, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన యావత్తు మానవజాతికి దివ్యభవితవ్యమైన కమ్యూనిజానికి బాట వేస్తోన్న మన ప్రజలకు జేజేలు !

సోవియట్ ప్రజల సకల విజయాలకూ మహత్తర ఉత్తేజాన్నిచ్చిన, వాటిని నిర్మించిన సోవియట్ దేశ ఉజ్జ్వల కమ్యూనిస్టుపార్టీ చిరస్థాయి యగుగాక !

కమ్యూనిజం చిరస్థాయి యగుగాక !

*సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ,*
*సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గం,*
*సోవియట్ దేశ మంత్రివర్గం.*

# తొలి రోదసీ యాత్రికునితో యన్. యస్. కృష్చేవ్ సంభాషణ

సోచీ సమీపంలో వుంటోన్న సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్రథమ కార్యదర్శి. సోవియట్ దేశ మంత్రి వర్గాధ్యక్షుడు అయిన యన్. యస్. కృష్చేవ్ ఏప్రిల్ 12న రోజల్లా ఎంతో శ్రద్ధగా రోదసి నౌ

"వోస్తోక్" ఎగురవేతకు సన్నాహాలగురించీ; ప్రపంచానికి తొలి రోదసీయాత్రీకుడు, రోదసీ విజయానికి నాందీ ప్రస్తావన చేసిన వ్యక్తి, సోవియట్ దేశ పౌరుడు, వైమానికుడు, కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు అయిన యూరీ గగారిన్ యాత్ర గురించీ తెలుసుకుంటూ వున్నారు.

మొదటి రోదసీ యాత్ర సుకక్షితంగా ముగిసిన వార్త, నిర్దిష్ట ప్రాంతములో యూరీ గగారిన్ మాస్కో కాలం 1.00 పి. యం. కు దిగిన వార్త తెలిసిన వెంటనే ఆయనకూ, యన్. యస్. కృశ్చెవ్‌కూ టెలిఫోన్లో సంభాషణ జరిగింది. యూరీ గగారిన్ తనతో మాటాడదల్చుకున్నట్టు యన్. యస్. కృశ్చెవ్‌కు చెప్పబడింది.

"కామ్రేడ్ గగారిన్‌తో మాటాడడం నాకు చాలా సంతోషం" అన్నారు కృశ్చెవ్.

టెలిఫోన్ తీసుకుని కృశ్చెవ్ యిలా అన్నారు:

"ప్రియమైన యూరీ అలెక్సియేవిచ్, మీతో మాటాడడం నాకు సంతోషంగా వుంది."

వై. ఎ. గగారిన్: "ఇప్పుడే మీ అభినందన టెలిగ్రాం వచ్చింది. మీరు దాన్లో ప్రపంచ ప్రథమ రోదసీ యాత్ర జయప్రదంగా ముగిసినందుకు నన్ను అభినందించారు. నికితా కృశ్చెవ్, యీ అభినందనలను పంపినందుకు నేను మీకు కృతజ్ఞుణ్ని. ప్రథమ రోదసీయాత్ర జయప్రదమయ్యిందని చెప్పడానికి నేను ఆనందిస్తున్నాను."

కృశ్చెవ్: "ప్రియమైన యూరీ అలెక్సియేవిచ్! మిమ్మ నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ప్రపంచంలో రోదసీ యాత్ర చేసిన ప్రథమ వ్యక్తి మీరు. మీ వీర కృత్యంతో మీరు దేశానికి కీర్తిని సంపాదించారు, ఇటువంటి ముఖ్యకర్తవ్యాన్ని నెరవేర్చి మీరు ధైర్యసాహసాలను ప్రదర్శించారు. మీ వీరకృత్యం ద్వారా మీరు రోదసీ ప్రవేశం చేసిన ప్రథమ మానవులుగా అమరత్వాన్ని సాధించారు.

"ఈ యాత్రలో మీ అనుభవమేమిటో, యూరీ అలెక్సియేవిచ్ నాకు చెప్పండి. ఈ మొదటి రోదసీ యాత్ర ఎలా సాగింది?

గగారిన్ : "నేను కులాసాగానే వున్నాను. యాత్ర అత్యంత జయ ప్రదంగా వుంది. రోదసీ నౌక యంత్ర పరికరాలన్నీ తప్పు లేకుండా పని చేశాయి. యాత్రా సమయంలో ఎంతో ఎత్తునుండి నేను భూమిని చూడగలి గాను. నేను సముద్రాలు, పర్వతాలు, పెద్ద నగరాలు, నదులు, అడవులు చూడగలిగాను."

క్రుశ్చెవ్ : "మీరు కులాసాగా వున్నారనవచ్చా ?"

గగారిన్ : "అవును, నికితా సెర్గియేవిచ్. రోదసీ నౌకలో నేను కులా సాగా వున్నాను, ఇబ్బంది లేకుండావున్నాను. యాత్ర జయప్రదమైనందుకు మీరు దయతో అభినందనలనూ, శుభాకాంక్షలనూ పంపినందుకు మీకు మళ్ళీ నా కృతజ్ఞత."

క్రుశ్చెవ్: "మీ గొంతు వింటున్నందుకూ, మిమ్మ అభినందిస్తున్నం దుకూ సంతోషం. మాస్కోలో మిమ్మలను సంతోష ప్రదంగా కలుసుకుం టాను. మీతోనూ, యావత్ప్రజలతోనూ, రోదసీ విజయంలో యీ గొప్ప కార్యం జరిగినందుకు మేము ఉత్సవం చేస్తాము. మన దేశపు సామర్థ్యాన్ని, మన మహాప్రజల, మన సోవియట్ విజ్ఞాన శాస్త్ర సామర్థ్యాన్నీ యావత్ప్ర పంచమూ తెలుసుకొనుగాక."

గగారిన్ : "ఇప్పుడు అన్ని దేశాలూ మనలను అందుకొనును గాక!"

క్రుశ్చెవ్ : "అవును, బాగుంది! మీ గొంతు యింత ఉల్లాసంగా, ధైర్యంగా వుండడమూ, మీరు గొప్ప సంతోషంగా వుండడమూ నాకు సంతోషంగా వుంది! మీరు చెప్పింది నిజమే; రోదసిలోనికి బాటవేసి, ప్రపంచ ప్రథమ రోదసీ యాత్రీకుని పైకి పంపిన మన దేశాన్ని అందు కొనమనండి. ఈ మహా విజయం సాధించినందుకు మనం అంతా చాలా గర్వంగా వున్నాము.

"అనస్తాస్ ఇవనోవిచ్ మికొయాన్ యిక్కడ వున్నారు. ఆయన మీకు తన అభినందనలనూ, శుభాకాంక్షలనూ పంపుతున్నారు."

గగారిన్ : "దయచేసి నా కృతజ్ఞతనూ, శుభాకాంక్షలనూ అనస్తాస్ ఇవనోవిచ్‌కి అందజేయండి !"

క్రుశ్చేవ్ : "యూరీ అలెక్సీయేవిచ్. మీకు భార్యా బిడ్డలున్నారా ?"

గగారిన్ : "అవును నాకు భార్య వుంది, పేరు వాలెంటీనా ఇవనోవ్నా; ఇద్దరు కుమార్తెలున్నారు—పేర్లు, లీనా, గాల్యా."

క్రుశ్చేవ్ : "మీరు రోదసిలోనికి వెళ్తారని మీ ఆవిడకు తెలుసునా ?"

గగారిన్ : "అవును, ఆమెకు తెలుసును."

క్రుశ్చేవ్ : మీ భార్యకు, పిల్లలకూ నా శుభాకాంక్ష లందజెయ్యండి. వారు పెరిగి పెద్దవారయి, మన సోవియట్ దేశం పేరిట యింతటి మహత్తర కార్యం చేసిన తమ తండ్రి గురించి గర్వపడుదురు గాక."

గగారిన్ : "నికితా సెర్గియేవిచ్, మీకు నా కృతజ్ఞత. నేను మీ అభివాదాలను అందజేస్తాను. మీరు దయతో చెప్పిన మాటలు ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకుంటాను."

క్రుశ్చేవ్ : "మీ తలిదండ్రులు జీవించి వున్నారా ? వారిప్పు డెక్కడున్నారు ? వారేం చేస్తున్నారు ?"

గగారిన్ : "మా తలిదండ్రులు సజీవులే. వారు స్మోలెన్స్క్ మండలంలో వుంటున్నారు."

క్రుశ్చేవ్ : "నా పక్షాన మీ తలిదండ్రులను అభినందించండి. ఇటువంటి గొప్ప కార్యాన్ని చేసిన తమ కుమారుణ్ణి చూసుకుని వారు గర్వపడవచ్చును."

గగారిన్ : "చాలా కృతజ్ఞుణ్ణి. మా అమ్మ, నాన్నకు మీ మాటలు చెప్తాను. వారు సంతోషిస్తారు; మీకు, మన పార్టీకీ, సోవియట్ ప్రభుత్వానికీ కృతజ్ఞత చూపుతారు."

క్రుశ్చేవ్ : "యూరీ అలెక్సీయేవిచ్, మీ తలిదండ్రులే కాదు, మీ ఘన కార్యానికి యావత్తు సోవియట్ దేశమూ గర్విస్తోంది. మీరు యుగయుగాలుగా నిలిచిపోయే గొప్ప కార్యం చేశారు.

"మొదటి రోదసీ యాత్రను జయప్రదంగా పూర్తి చేసినందుకు నేను

యింకోసారి హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. మీకు నా శుభా కాంక్షలు. సెలవు, మళ్ళీ మాస్కోలో మనం కలుసుకునే వరకూ."

గగారిన్ : "కృతజ్ఞుణి, నికితా సెర్గియేవిచ్. మీకూ, మన కమ్యూనిస్టు పార్టీకి, సోవియట్ ప్రభుత్వానికీ నా పట్ల యింతగా విశ్వాసాన్ని చూపినందుకు నేను మళ్ళీ కృతజ్ఞత తెలుపుతున్నాను. మన సోవియట్ దేశం అప్పగించే ఎటువంటి బాధ్యతనైనా నెరవేర్చడానికి నేను ఎప్పుడూ సిద్ధంగా వుండగలనని మాట యిస్తున్నాను. ప్రియమైన నికితా సెర్గియేవిచ్ సెలవు!"

# ఇది ఈ విధంగా జరిగింది

## ప్రపంచానికి ప్రప్రథమంగా మానవుని అంతరిక్ష యాత్ర గురించి టాస్ ప్రకటన

ప్రపంచపు మొట్టమొదటి ఉపగ్రహ రోదసీ నౌక "వోస్తాక్" (ప్రాచ్యం) ఒక మానవునితో, భూమిచుట్టు కక్ష్యలో సోవియట్ దేశంలో 1961 ఏప్రిల్ 12వ తేదీన ప్రవేశ పెట్టబడింది.

ఉపగ్రహ రోదసీ నౌక "వోస్తాక్"లోని చోదకుడు విమాన దళానికి చెందిన మేజర్ యూరి అలెక్సియేవిచ్ గగారిన్ అనే ఒక సోవియట్ సోష లిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య పౌరుడు.

అనేక అంచీల రోదసీ రాకెట్ ఎగురవేత విజయవంతంగా జరి గింది. భూమ్యాకర్షణను అధిగమించే వేగాన్ని అందుకొని, వాహక రాకెట్ చివరి అంచీనుండి విడివడిన తర్వాత, రోదసీ నౌక భూమి చుట్టూ కక్ష్య లోకి స్వేచ్ఛగా ప్రవేశించింది.

తొలి సమాచారం ప్రకారం రోదసీ నౌక భూమిచుట్టూ 89.1 నిమి షాల కొకసారి తిరిగివస్తున్నట్లు తెలుస్తున్నది. అది భూమికి 175 కిలోమీ టర్ల నీచ స్థాయిలోనూ, 302 కిలోమీటర్ల ఉచ్ఛ స్థాయి లోనూ, భూమధ్య రేఖకు 65 డిగ్రీల 4' కోణంలో పరిభ్రమిస్తున్నది.

చివరి అంచీ వాహక రాకెట్ బరువు మినహాయించగా రోదసీ నౌక చోదకునితోపాటు 4,725 కిలోగ్రాముల బరువు వున్నది.

భూమినుండి రోదసీ నౌకకూ, రోదసీ నౌకనుండి భూమికీ రేడియో సంబంధాలు స్థాపింపబడ్డాయి. రోదసీ నౌక చోదకుడు మేజర్ గగా రిన్‌తో రేడియో సంబంధాలు నడుస్తున్నాయి. రోదసీ నౌకలోని షార్ట్‌వేవ్ రేడియో ప్రసార యంత్రం నుండి 9.019 మెఘర్జ్‌లలో, 20.006 మెఘర్జ్ లలో, అల్ట్రా షార్ట్‌వేవ్ రేంజి 143.625 మెఘర్జ్‌లలో ప్రసారాలు వినబడు

ధైర్యశాలి అయిన సోవియట్ రోదసీ నౌకా చోదకుడు యూరీ గగారిన్ తో రోదసీ నౌక 'వోస్తోక్' పైకి వెళ్ళడానికి సిద్ధంగా వుంది.

క్లిష్టమైన సన్నాహాలు పూర్తి అయ్యాయి. రాకెట్టునూ, దాని వ్యవస్థనూ ప్రవీణులు చివరిసారి సరిచూశారు. పలు పరికరాలు నిర్దుష్టంగా వున్నాయి. గగారిన్‌ను రాకెట్ కొనకు తీసుకు వెళ్ళడానికి లిఫ్టు సిద్ధంగా వుంది. ఆయన కూర్చునే కోశం అక్కడ వుంది.

చరిత్రాత్మకమైన ఆ క్షణం వచ్చింది! ఈ పెద్ద రోదసీ నౌక, సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, డిజైనర్లు, కార్మికులు సృష్టించిన యీ అద్భుత వాహనం భూ ప్రదక్షిణకు బయలుదేరింది.





తాయి. రేడియో టెలిమెట్రిక్, టెలివిజన్ వ్యవస్థల ద్వారా చోదకుని పరిస్థితి తెలుస్తున్నది.

రోదసీ నౌక చోదకుడు కామ్రేడ్ గగారిన్, ఉపగ్రహ నౌక "ఓస్తాక్" కక్ష్యలోకి ప్రవేశ పెట్టబడినప్పుడు బాగానే తట్టుకున్నారు. యిప్పుడు కులాసాగా వున్నారు. ఉపగ్రహ నౌకలోని కోశంలో అవసరమైన పరిస్థితులను సమకూర్చే యంత్ర సాధనాలు బాగానే పనిచేస్తున్నాయి.

ఉపగ్రహ రోదసీ నౌక "ఓస్తాక్", దాని చోదకుడు గగారిన్‌తో సహా కక్ష్యలో ప్రయాణిస్తోంది.

## రోదసీ నౌక ఓస్తోక్ నుండి వార్తలు

9.52 ఎ. యం. మాస్కో కాలం

ఓస్తాక్" రోదసీ నౌక నుండి రోదసీ యాత్రికుడు మేజర్ గగారిన్ దక్షిణ అమెరికా పైన వుండగా, "చక్కగానే కొనసాగుతూంది యాత్ర, కులాసాగానే వున్నాను", అని తెలియజేశారు.

10.15 ఎ. యం. మాస్కో కాలం

ఆఫ్రికా పైని ఎగురుతూ మేజర్ గగారిన్ యిలా తెలియ జేశారు : "యాత్ర బాగా సాగుతోంది. భారరాహిత్యాన్ని బాగా తట్టుకుంటున్నాను".

10.25 ఎ. యం. మాస్కో కాలం

నిర్ణీత కార్యక్రమం ప్రకారం రోదసీ నౌక భూ ప్రదక్షిణ చేశాక, విడిపోయే రాకెట్టు పేల్చబడింది. గగారిన్‌తో వున్న రోదసీ నౌక, సోవియట్ దేశంలోని నిర్ణీత స్థలంలో కక్ష్యలోనుండి దిగడం ప్రారంభించింది.

## భూమికి సరక్షితంగా మానవుని పునరాగమనం

ప్రయాణ కార్యక్రమాన్ని, పరిశీలనలనూ పూర్తి చేసుకుని సోవియట్ రోదసీనౌక "వోస్తోక్" సోవియట్ దేశంలో ముందుగా నిర్ణయించ

పడిన స్థలంలో 1961 ఏప్రిల్ 12న మాస్కో కాలమానం 10 గంటల 55 నిముషాలకు సురక్షితంగా వచ్చి దిగింది.

రోదసీ యాత్రికుడు మేజర్ గగారిన్ భూమి పైని దిగాక యిలా అన్నారు : "భూమి మీదికి దిగడం బాగానే జరిగిందనీ, నేను కులాసాగా వున్నాననీ, నాకెలాంటి గాయాలూ తగలలేదనీ దయచేసి పార్టీకి, ప్రభుత్వానికీ, నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్‌కూ తెలియజేయండి".

అంతరిక్షంలో మానవుడు జయప్రదంగా ప్రయాణం చేసి రావడం, రోదసీ విజయానికి అద్భుతమైన అవకాశాలను మానవాళికి కల్పిస్తున్నది.

# రోదసీ నౌకపై నుండి గగారిన్ పంపిన సమాచారం

ఏప్రిల్ 12న 19.00 గంటలకు ప్రసారం చేసిన సాయంకాలం వార్తలలో మాస్కో రేడియో, మొదటి సోవియట్ రోదసీ నౌకా చోదకుని గొంతును, టేప్ రికార్డును ప్రసారం చేసింది.

మొదటి మానవ రోదసీ యాత్రీకుడు యూరీ అలెక్సియేవిచ్ గగారిన్‌తో రోదసీ నౌక "ఓస్తోక్" భూమిపైని ఎగురుతోన్న చరిత్రాత్మక క్షణాలలో, భూమికీ రోదసీ నౌకకూ మధ్యను యిరువేపుల రేడియో ప్రసారం స్థాపింపబడింది. తన స్థితినీ, యాత్రాప్రగతినీ కామ్రేడ్ గగారిన్ భూమికి తెలియజేశారు.

సూక్ష్మకాలపు రేడియో సంబంధాల సమయంలో సోవియట్ రోదసీ యాత్రికుడు పంపిన వార్తలను యీ దిగువ నిస్తున్నాము :

"నాకు భూమి కనిపిస్తోంది. దృశ్యం బాగానేవుంది. మీరు చెప్పింది చాలా బాగా వినిపిస్తోంది.

కాస్సేపు తరవాత రోదసి నుండి కొత్త సమాచారం వచ్చింది :

"యాత్ర బాగా సాగిపోతోంది. భూమి నాకు కనిపిస్తోంది. దృశ్యం

బాగానే వుంది....ప్రతి ఒక్కటీ నేను చూడగలుగుతున్నాను. రోదసిలో కొంత భాగాన్ని మేఘాల వంటివి కప్పివున్నాయి.

గగారిన్ పంపిన తదుపరి సమాచారం :

"నేను యాత్రను సాగిస్తూనే వున్నాను—ప్రతి ఒక్కటీ మామూలుగానే వుంది. శాస్త్ర పరికరాలు అద్భుతంగా పనిచేస్తున్నాయి. ప్రతి ఒక్కటీ చాలా సక్రమంగా వుంది. నా యాత్ర సాగిపోతోంది."

తరవాత యింకో సమాచారం వచ్చింది :

"బాగున్నాను. చాలా ఉత్సాహంగా వున్నాను. నా యాత్ర సాగిపోతూ వుంది. యంత్రం మామూలుగా సాగిపోతోంది."

పురుషకారం, ధైర్యంతో నిండిన యీ గొప్ప సమాచారం, యిప్పటికే చరిత్రలోని కెక్కిపోయింది. రోదసి పైని సోవియట్ పౌరుని మహత్తర విజయానికి సాక్ష్యంగా అది సర్వదా నిలిచిపోతుంది.

# గగారిన్‌తో ఇంటర్వ్యూ

*యూరీ గగారిన్ ఇజ్వెస్తియా పత్రికా విలేఖరికి 1961 ఏప్రిల్ 13న యిచ్చిన ఇంటర్వ్యూ పాఠం యీ దిగువ నిస్తున్నాము:*

ప్రశ్న: రోదసీ నౌకలో ప్రవేశించడానికి ముందర మీకు ఎలా వుంది?

జబాబు: రోదసీ నౌకలో ప్రవేశించడానికి ముందర నేనెంతో ఆనందంగా వున్నాను. మొదటి రోదసీ యాత్ర బాధ్యత నాకు అప్పగింప బడినందుకు నేను గర్వపడ్డాను. తెలుసుకోవలసింది యింకా ఎంతో వున్న యీ రోదసీ యాత్ర విషయంలో గల గొప్ప బాధ్యతను కూడా నేను గుర్తించాను. రోదసి లోనికి మనిషిని పంపగల యిటువంటి బలవత్తర మైన వాహనాలను సృష్టించినవారిని తలుచుకుని నేను గర్వించాను.

ప్రశ్న: యాత్రా సమయంలో మీకు వచ్చిన ఆలోచనలేమిటి?

జబాబు: యాత్రా కార్యక్రమాన్ని అమలు జరపడంపైనే నా అన్ని ఆలోచనలూ లగ్నమైనాయి. సాధ్యమైనంత బాగా ప్రతి ఒక్క చిన్న పనినీ నెరవేర్చాలనుకున్నాను. చెయ్యవలసిన పని ఎంతో వుంది, ఆ యాత్ర అంతా పనే కదా.

ప్రశ్న: రోదసీ నౌక పంపబడ్డాక భారానికి సంబంధించిన అను భవం తొలగి పోవడం ప్రారంభమైనప్పుడూ, అదిమళ్ళీ రావడం ప్రారంభ మైనప్పుడూ మీకెలా వున్నది?

జబాబు: భారరాహిత్యం మొదలయ్యినప్పుడు నేను కులాసాగా వున్నాను. ప్రతి పనీ చెయ్యడం తేలికయ్యింది. ఇది సహజమే. చేతులకు, పాదాలకూ బరువే వుండదు. వస్తువులు గాలిలో తేలిపోయాయి. నేను ముందరిలాగా కుర్చీలో కూచొని లేను, గాలిలో తేలివున్నాను .భార

రాహిత్యంలో నేను తిన్నాను, త్రాగాను; ప్రతి ఒక్కటీ భూమి మీద వున్నప్పటిలాగే వుంది. నేను పని చేశాను, నా పరిశీలనను రాశాను. నా చేతికి బరువేమీ లేకపోయినప్పటికీ, నా వ్రాత మునుపటిలాగానే వుంది. నా చేతిలోనుంచి నోటు పుస్తకం పైకి తేలిపోకుండా, దానిని నేను కిందికి పట్టి వుంచవలసి వచ్చింది. వివిధ మార్గాల ద్వారా నేను వార్తా ప్రసారాన్ని సాగించాను. టెలిగ్రాఫ్ కీని నేను ఉపయోగించాను. నా పని శక్తిని భార రాహిత్యం ఏ విధంగానూ తగ్గించలేదు. భారరాహిత్యం నుండి గురుత్వానికీ గురుత్వ ప్రవేశానికీ పరిణామం క్రమక్రమంగా జరిగింది. సున్నా-గ్రావిటీలో వున్నట్టుగానే నా చేతులూ, పాదాలూ వున్నాయి. అయితే వాటికి వాస్త భారం మాత్రం వుంది. నేను కుర్చీలో లేచిపోవటం లేదు, దానిలో మళ్ళీ కూచోగలిగాను.

ప్రశ్న: భూమి పగలు, రాత్రి భాగాలు ఎంచేత ఒకేలాగ కనిపించాయి? ఆకాశం, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలూ యెలా కనిపించాయి?

జవాబు: ఎత్తుపైనుంచి భూమి పగటి పూట భాగం బాగా కనిపించింది. నేను ఖండాల తీరాలనూ, దీవులనూ, పెద్ద నదులనూ, పెద్ద జలాశ్రయాలనూ, ఎత్తులనూ చూడగలిగాను. మన దేశంపైన ఎగిరి వెళ్తోన్నప్పుడు సమిష్టి క్షేత్రాల పొలాల చివరాలను నేను స్పష్టంగా చూడగలిగాను. దున్నబడిన పొలాలనూ, మైదానాలనూ కనుక్కోగలిగాను. నేను యింతకు ముందు ఎన్నడూ 15 వేల మీటర్లకు పైగా ఎగరలేదు. రోదసీ నౌకనుంచి విమానం మీద అంత బాగా చూడలేకపోయాననుకొంటి; అయినా బాగానే చూశాను. యాత్రా సమయంలో భూమి గోళాకారాన్ని తొలిసారిగా చూశాను. క్షితిజం వద్ద నది అలా కనిపించింది. క్షితిజం అపూర్వంగా, ఎంతో అందంగా కనిపించిందని నేను చెప్పాలి. కాంతి వంతమైన భూతలంనుండి కటిక చీకటి ఆకాశానికి, నక్షత్రాలతో ఆకాశంలోని అపూర్వమైన వివిధ వర్ణాలతో కూడిన పరిణామం జరిగింది. ఈ పరిణామం చాలా సన్నగా జరిగింది, భూగోళాన్ని ఒక పొర చుట్టివున్నట్టుగా వుంది ఒక మాదిరిగా. ఇది సున్నితమైన లేత నీలపురంగు. నీలంనుండి నలుపుకు పరిణామం చాలా క్రమంగానూ, అందం



రోదసీ నౌకను పైకి పంపే చోటికి బస్సులో వెళ్తోన్న యూరీ గగారిన్

గానూ జరిగింది. దీనిని మాటల్లో చెప్పడంకూడా కష్టం. నేను భూమి మీద నుండి బయట కొచ్చాక క్షితిజం భిన్నంగా వుంది. దానిపైని ప్రకాశవంతమైన కమలా పండు రంగు పీలిక వుంది. అది క్రమంగా నీలంగా, తరువాత

చాలా నలుపుగా మారింది. నేను చంద్రుణ్ని చూడలేదు. భూమిమీదకంటె సూర్యుడు కొన్ని పదుల రెట్లు తేజోవంతంగా ప్రకాశించాడు. నక్షత్రాలు చాలా బాగా కనిపించాయి. అవి తేజస్సుతో స్పష్టంగా వున్నాయి. భూమి మీదనుండి మనం చూసేదానికీ, యిక్కడ ఆకాశపు దృశ్యానికీ తేడా చాలా ఎక్కువగా వుంది.

ప్రశ్న : రోదసిలో మీకు ఒంటరితన మనిపించిందా ?

జవాబు : నాకు ఒంటరితన మనిపించనేలేదు. నా స్నేహితులు, సోవియట్ ప్రజలందరూ నా రోదసీ యాత్రను గమనిస్తున్నారని నాకు బాగా తెలుసు. నేనేమైనా కష్టాలను ఎదుర్కోవలసి వస్తే పార్టీ, ప్రభుత్వమూ నా సహాయానికి రావడానికి సిద్ధంగా వున్నాయని నా నమ్మకం.

ప్రశ్న : మొదటి సోవియట్ స్పుత్నిక్ పంపబడినప్పుడు మీరెక్కడున్నారు, మీరేం చేస్తున్నారు, మీరు మొదటి రోదసీ నౌకా చోదకుడు అవగలరని ఊహించారా ?

జవాబు : మొదటి సోవియట్ కృత్రిమ భూ ఉపగ్రహం పంపబడినప్పుడు, నేను ఓరెన్‌బర్గ్ వైమానిక పాఠశాలలో చదువు పూర్తి చేసుకుంటున్నాను. యం ఐ జి విమానాలపైన శిక్షణా యాత్రలనుంచి, మే మారోజు తిరిగి వచ్చాము. నా కామ్రేడ్స్‌తో బాటుగా నేను సోవియట్ విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల ఆ ఘన విజయానికి చాలా గర్వించాను. మానవుడు రోదసిలోనికి ఎగిరేకాలం దూరంగా లేదని అప్పుడు స్పష్టమే. కాని యిది చాలా తొందరగా జరిగేది కాదనుకున్నాను; బహుశా పదేళ్ళో, ఆ పైచిలుకో పడుతుందనుకున్నాను. కాని నాలుగేళ్ళకు తక్కువ మాత్రమే అయ్యింది. అప్పుడు రోదసీ యాత్ర చేయడమంటే నా కిష్టం వుండేది, కాని రోదసీ నౌకలో నేనే తొలిసారిగా వెళ్తానని నేను కలకూడా కనలేము.

ప్రశ్న : పాఠశాలలో ఏ విషయం మీకు ఎక్కువ ఇష్టంగా వుండేది.

జవాబు : గ్జాట్స్క్ సెకండరీ పాఠశాలలో నేను ఆరు తరగతులు పూర్తి చేశాను. తరవాత ల్యుబెర్ట్సీ వృత్తి పాఠశాలలో చదివాను. ఆ

తరవాత సారతోవ్‌లోని పారిశ్రామిక సాంకేతిక పాఠశాలలో చదివాను. ఆ సంవత్సరాలన్నిట్లో నా అభిమాన విషయాలు, పదార్థ విజ్ఞాన, గణిత శాస్త్రాలు.

ప్రశ్న : త్సియొల్కోవ్‌స్కి గురించి మీరు మొదటిసారిగా ఎప్పుడు విన్నారు ?

జబాబు : త్సియొల్కోవ్‌స్కి గురించి నేను మొదటిసారిగా పాఠశాలలో విన్నాను. సాంకేతిక పాఠశాలలోనూ, వైమానిక పాఠశాలలోనూ నేను చదివినప్పుడు ఆయన పేరు మాకు చాలా ప్రీతిపాత్ర మయ్యింది. మేము ఆయన రచనలు చదివాము. "భూమి కావల" అన్న తమ గ్రంథంలో ఆయన, నా యాత్రా సమయం నేను చూసిన ప్రతిఒక్కదానినీ చాలా స్పష్టంగా జోస్యంచెప్పారు. కాన్‌స్తాంతిన్ త్సియొల్కోవ్‌స్కి, ఇంకెవ్వరూ చేయనంత బాగా, రోదసిలో మానవ నేత్రాలకు కనిపించే ప్రపంచాన్ని ఊహించారు.

ప్రశ్న : సారస్వతంలో మీ అభిమాన పాత్ర ఏది ? మీ అభిమాన రచయిత ఎవరు ?

జబాబు : నాకు అభిమాన రచయితలు చాలా మంది వున్నారు— సోవియట్ రచయితలూ, పాత రచయితలూ. ఛెఖోవ్, టాల్‌స్టాయ్, పుష్కిన్, పొలెవోయ్ రచనలు చదవడమంటే నాకు చాలా యిష్టం. బాల్యం నుండీ నా అభిమాన సారస్వత పాత్ర, బోరిస్ పొలెవోయ్ రచించిన "యదార్ధ మానవుని జీవిత కథ"లోని నాయక పాత్ర. మెరెస్యేవ్‌ను ఎన్నడూ కలుసుకోవడం పడనందుకు నాకు చాలా విచారంగా వుంది. జూలెస్ వెర్నె పుస్తకాలు చదివాను. ఆయన పుస్తకాలు చాలా ఆసక్తి జనకంగా వుంటాయి. కాని ఆయన ఊహా జగత్తు ననుసరించి వాస్తవిక జగత్తు లేదని యిప్పుడు మనకు తెలుస్తోంది. "ఆంద్రొమెదా, రోదసీ కథ" నాకు బాగా నచ్చింది. అయితే రోదసిని చూసిన వ్యక్తికి, దానిలోనివన్నీ వాస్తవికంగా కనిపించవు. అయినా అది ఉపయోగకరమైన పుస్తకం.

ప్రశ్న : మీరు కులాసాగా వుండడాన్నిబట్టి, రోదసిలో మీరు ఇంకా ఎక్కువకాలం వుండగలిగేవారా ?

జబాబు : రోదసీ నౌకలో నేను యింకా చాలాకాలం వుండగలిగే వాణ్ని. కాని నా యాత్రాకాలం ముందుగా నిర్ణయింపబడిన కార్యక్రమంలో సూచింపబడింది. నేను ఆ రోదసీ నౌకలో బాగా పనిచేశాను, కులాసాగా, ఉత్సాహంగా వున్నాను. ఈ పనికి అవసరమయినంత సేపూ నేను వుండ గలిగేవాణ్నని నా విశ్వాసం.

ప్రశ్న : మీరు భూమికి వచ్చాక మీకు కలిగిన మొదటి భావం ఏమిటి ?

జబాబు : మన సోవియట్ భూమి పైని నేను అడుగు పెట్టినప్పుడు నన్ను ముంచెత్తిన భావాలను మాటలలో చెప్పడం చాలా కష్టం. కర్తవ్యం జయప్రదమైనందుకు నేను ప్రప్రథమంగా సంతోషించాను. మొత్తం మీద నేను ఆనందపరవశుణ్నయ్యాను. నేను క్రిందికి దిగినప్పుడు : "దేశం వింటోంది, దేశం తెలుసుకుంటోంది...."అన్న పాటను నేను పాడాను.

ప్రశ్న : రోదసీ యాత్ర చెయ్యమని వచ్చిన ఆహ్వానాన్ని మీరెలా భావించారు ?

జబాబు : రోదసీ యాత్రకు వాంఛ, నా వ్యక్తిగతమైన వాంఛ. రోదసీ నౌకా చోదకుణ్ని కావాలని నేననుకున్నాను. ఈ పని నా కప్పగింప బడినప్పుడు, నేను యాత్రకు సన్నాహం చేయడం మొదలు పెట్టాను. నా వాంఛ ఈడేరిందని మీకు స్పష్టమే కదా.

ప్రశ్న : మీరు ఆటలాడతారా ? మీకు ఎక్కువగా ఏ ఆటలిష్టం ?

జబాబు : నాకు ఆటలంటే యిష్టమే, అన్నిటికంటె ఎక్కువగా నేను బాస్కెట్ బాల్ ఆడతాను. ఇంతేకాకుండా స్కీయింగ్, స్కేటింగ్, బాడ్మింటన్ కూడా యిష్టమే. ఇది మంచి ఆట, చాలా శ్రమ కలిగిస్తుంది.

ప్రశ్న : మీ అభిమాన వృత్తి ఏమిటి ?

జబాబు : అన్నిటికంటె ఎక్కువగా నాకు ఎగరడం యిష్టం. ఇప్పటివరకూ నేను విమానాలు నడిపించాను. ఈ రోదసీ యాత్ర నాకు

చాలా యిష్టం. నా మొదటి విమాన యాత్రను, నిన్నటి రోదసీ యాత్రతో పోల్చగలనా ? ఇది చాలా కష్టం. ఒక యాత్ర రెక్కల వాహనం మీద, రెండోదానికి రెక్కల్లేవు. మొదటిది గంటకు 150 కిలోమీటర్ల వేగంతో, రెండోది గంటకు 28,000 కిలోమీటర్ల వేగంతో. మొదటిదాని ఎత్తు 1,500 మీటర్లు, రెండోదాని ఎత్తు 300 కిలోమీటర్లు.

ప్రశ్న : మీరు భూమికి తిరిగి వచ్చినప్పుడు, మీకు యెక్కువగా ఏది సంతోషం కలిగించింది ?

జబాబు : భూమికి తిరిగి రావడం నాకు చాలా సంతోషం కలిగించింది. మన సోవియట్ ప్రజలు నాకు పెద్ద స్వాగతం యిచ్చారు. నికితా సెర్గియేవిచ్ కృష్చెవ్ టెలిగ్రాము నాకు ఆనంద బాష్పాలు తెప్పించింది. ఆయన శ్రద్ధ, ఆదరణ, అభిమానం నన్ను పరవశుణ్ని చేశాయి. యన్. యస్. కృష్చెవ్ తోనూ, యల్. ఐ. బ్రెజ్నెవ్‌తోనూ నేను టెలిఫోన్లో మాటాడినప్పుడు నాకు అపరిమితమైన ఆనందం కలిగింది. నా పట్ల చూపిన ఆదరానికి నికితా సెర్గియేవిచ్‌కి నా హృదయపూర్వకమైన కృతజ్ఞత, నా ప్రేమపూర్వకమైన కృతజ్ఞత.

ప్రశ్న : అమెరికా కూడా మనిషిని రోదసి లోనికి పంపదలుచుకున్నదని విదేశ పత్రికలు వ్రాస్తున్నాయి. దీనిగురించి మీరేమి చెపుతారు ?

జబాబు : మన పార్టీ, ప్రభుత్వమూ రోదసిని శాంతియుత ప్రయోజనాలకు, శాంతియుతమైన పోటీకీ ఉపయోగించాలని చెప్పాయి. అమెరికన్ రోదసీ నౌకా చోదకులు రోదసీ యాత్రలో విజయులైతే, మనం సంతోషిస్తాము. రోదసిలో అందరికీ చాలినంత చోటుంది. అయితే ఆ ప్రదేశం శాంతియుతమైన ప్రయోజనాలకు ఉపయోగపడాలి, సైనిక లక్ష్యాల కోసరం కాదు. అమెరికన్ రోదసీ యాత్రికులు మనలను అందుకోవలసి వుంటుంది. వారి విజయాలను మనం హర్షిస్తాము, కాని మనం ఎప్పుడూ వారిని మించిపోవడానికే ప్రయత్నిస్తాము.

ప్రశ్న : ఈ యాత్రకు ముందర మీ జీవితంలోని అత్యంత ప్రముఖ ఘటన ఏమిటి ?

జబాబు : 1960 వేసవిలో నేను పార్టీలో చేరాను. ఈ రోదసీ యాత్ర వరకూ, అది నా జీవితంలోని అన్నిటికంటె గొప్ప ఘటన, అత్యంత విస్పష్ట సంఘటన. నా రోదసీ యాత్రను మన పార్టీకి, మన ప్రభుత్వానికీ, 22వ పార్టీ మహాసభకూ, మానవజాతికి అగ్రశ్రేణిని పురోగమిస్తూ నవ సమాజాన్ని నిర్మిస్తోన్న యావన్మంది ప్రజలకూ అంకితం చేస్తున్నాను.

ప్రశ్న : మీ భావి పథకాలేమిటి ? మీరు యింకోసారి యీ యాత్ర చేస్తారా ?

జబాబు : నా భావి పథకా లివీ : ఇప్పుడు రోదసిని జయించడంలో నిమగ్నమైవున్న నూతన విజ్ఞాన శాస్త్రానికి నా జీవితాన్నీ, నా కృషినీ, నా మనస్సునూ, నా ఆత్మనూ అర్పించ దలచుకున్నాను. శుక్ర గ్రహానికి వెళ్ళి, దాని మేఘాల మాటున ఏమివుందో చూద్దామని వుంది. అంగారక గ్రహానికి వెళ్ళి దానిలో ఏమైనా కాలువలున్నాయో లేవో చూద్దామనుంది. చంద్రుడు మనకు బాగా యిరుగు పొరుగు వాడే. చంద్రుని వేపుకూ, చంద్రలోకం లోనికీ వెళ్ళడానికి మనం అట్టేకాలం వేచివుండ నక్కర లేద నుకుంటాను.

ప్రశ్న : మొదటి స్పూత్నిక్ పంపబడిన తరవాత, రోదసి లోనికి తమ్ము పంపమని వేలాదిమంది ఉత్తరాలు వ్రాశారు. ఈ ఉత్తరాలేవైనా మీరు చదివారా ?

జబాబు : అవును, నేనీ ఉత్తరాలు చదివి, అవ్వన్నీ హృదయ పూర్వకంగా వ్రాసినవేనని భావించాను. ఈ యాత్ర చేయడానికి వారికి అవకాశం లభించనందుకు విచారిస్తున్నాను. అయితే భూమికి చుట్టూరా యాత్రలను కార్మిక సంఘాలు ఏర్పాటుచేసే కాలం వస్తుందని నానమ్మకం.

ప్రశ్న : మీ తలిదండ్రులకూ, మీ తోడి నగరవాసులకూ మీరేమైన సందేశం యిస్తారా ?

జబాబు : నా తలిదండ్రులకూ, నా తోడి నగరవాసులకూ, అభివాదాలనూ, వనిలోనూ, జీవితంలోనూ వారికి విజయం ప్రాప్తించాలని శుభాకాంక్షలనూ అందజేస్తున్నాను.

# తొలి రోదసీ నౌకా చోదకుడు యూరీ గగారిన్

యూరీ గగారిన్. ఆయన పేరు, చరిత్రలో తొలి రోదసీ నౌకా చోదకుని పేరు, ప్రపంచ నాగరికతా చరిత్రలో నూతనాధ్యాయాన్ని ప్రారంభించిన యీయన ఎవరు ?

## వయస్సు 27 ఏళ్లు

మేజర్ యూరీ గగారిన్ వయస్సు 27 ఏళ్ళు. ఈయన 1934 మార్చి 9న, రష్యన్ సమాఖ్య స్మోలెన్స్కి మండలం, గ్జాత్స్కి జిల్లా లోని ఒక సమిష్టి క్షేత్ర సభ్యుని కుటుంబంలో జన్మించారు.

1941లో ఆయన సెకండరీ పాఠశాలలో ప్రవేశించారు, కాని హిట్లర్ దాడి ఆయన చదువుకు విఘ్నం కలిగించింది.

యుద్ధానంతరం గగారిన్ కుటుంబం గ్జాత్స్కికు వెళ్ళిపోయింది. ఇక్కడ యూరీ సెకండరీ పాఠశాల చదువు సాగించారు. మాస్కోకు సమీపంలోవున్న ల్యుబెర్ట్సీ నగరంలోని ఒక వృత్తి పాఠశాలలో ఆయన 1951లో ఉన్నత శ్రేణిలో పట్టభద్రులై, ఫౌండ్రీమన్ యోగ్యతా పత్రాన్ని పుచ్చుకున్నారు. ఇదే సమయంలో సాయంకాలపు సెకండరీ పాఠశాలలో చదువు పూర్తిచేసుకున్నారు.

తరవాత ఆయన ఓల్గాపైనున్న సారతోవ్‌లోని ఒక పారిశ్రామిక సాంకేతిక పాఠశాలలో చదివి, 1955లో దీనిలో కూడా ఉన్నత శ్రేణిలో పట్టభద్రులయ్యారు.

ఈ సాంకేతిక పాఠశాలలో విద్యార్థిగా వున్నప్పుడే యూరీ గగారిన్ విమాన యానంలో మొదటిసారిగా శిక్షణను పొందారు. ఆయన సారతోవ్ వైమానిక సమాజానికి హాజరయ్యారు. 1955లో వైమానిక సమాజంలో

ఒక శిక్షణను పూర్తి చేసుకున్నారు, ఆయన ఓరెన్‌బర్గ్‌లోని వైమానిక దళ పాఠశాలలో ప్రవేశించారు. 1957 నుండీ, ప్రథమ శ్రేణి యోగ్యతా పత్రంతో ఆ పాఠశాలలో పట్టభద్రుడయ్యాక, యూరీ గగారిన్ సోవియట్ విమాన సైన్యంలో చోదకునిగా పని చేశారు.

గత సంవత్సరం యూరీ గగారిన్ సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీలో చేరారు.

ఆయనకు వివాహ మయ్యింది. ఆయన భార్య వాలెంటీనా, ఆయన కంటె ఒక ఏడాది చిన్న. ఆమె ఓరెన్‌బర్గ్ వైద్య పాఠశాల పట్టభద్రురాలు. వారికి యిద్దరు కుమార్తె లున్నారు, రెండేళ్ళ ఎలీనా, ఒక మాసం వయస్సు గల గాల్యా.

గగారిన్ తండ్రి వయస్సు 59 ఏళ్ళు, వడ్రంగిగా పని చేస్తున్నారు. తల్లి, అన్నా 1903లో జన్మించింది, గృహిణి.

ఆయన జీవితకథ సామాన్యమైనది. అది దీర్ఘమైనదేమీ కాదు, అయినా సోవియట్ ప్రధానమంత్రి యన్. యస్. కృశ్చెవ్ మాటలలో చెప్పాలంటే, తన దేశానికి కీర్తి తెచ్చి, అమరత్వం తనకు సంపాదించుకున్న వీరుని జీవిత కథ యిది.

# గ్జత్స్క సమీపాన జననం

స్మోలెన్‌స్క మండలం. ఇక్కడ, మాస్కో మండలానికి సరిగ్గా సరిహద్దుమీద, నార రైతులకు ప్రసిద్ధి చెందిన జిల్లా పొలాలున్నాయి. ఈ జిల్లా కేంద్రం గ్జత్స్క. సెయింట్ పీటర్స్‌బర్గ్‌కు ధాన్యం, యితర సరుకులు రవాణా చేయడానికి గ్జత్ నది పైని ఓడ రేవుగా, 18వ శతాబ్దం మొదట్లో నిర్మింపబడిన పాత రష్యన్ నగరం యిది. గ్జత్స్కలో పెద్ద రైలు స్టేషన్ వుంది. మాస్కో—మిన్స్క రహదారి దానిగుండా వెళ్తుంది.

1934 మార్చి 9న అలెక్సీ ఇవనోవిచ్ గగారిన్ కుటుంబం—యీయన గ్జత్స్కకు సమీపంలోని ఒక సమష్టి క్షేత్ర సభ్యుడు—వారి



యూరీ గగారిన్‌తో ఆయన భార్య వాలంతీనా ఇవనోవ్నా, వారి అమ్మాయి లేనా.

రెండో అమ్మాయి పుట్టిన పండగ చేసుకుంది. ఆ అమ్మాయికి యూరీ అన్న పేరు పెట్టబడింది.

ఏడేళ్ళప్రాయంలో యూరీ, హిట్లర్ దండయాత్ర ఫలితాలను అనుభవించారు. ఎన్నటికీ మరిపురాని సంఘటనలను ఆయన చూశారు. అమాయకంగా కొంటెచేష్ట చేసినందుకు యూరీ తమ్ముడు బోరిస్‌ను మున్నపోతు లాంటి నాజీ, కుక్కపిల్లను ఎత్తినట్టు పైకెత్తి ఒక ఆపిల్ చెట్టుకొమ్మకు మెడను వేలాడగట్టాడు. అతని తల్లి కుమిలికుమిలి ఏడుస్తూ, నాజీలు అతనిని దిబ్బలోనికి విసిరివేసిన భయంకరమైన ఆ చలి రాత్రి అతనికి జ్ఞాపకం వుంది.

పాఠశాలలో యూరీకి గణిత, పదార్థ విజ్ఞాన శాస్త్రాలు యిష్టం. గణితశాస్త్ర బృందంలో ఆయన చురుకైన సభ్యుడు, తన విరామ కాలంలో చాలా భాగం పదార్థ విజ్ఞానశాస్త్రపు గదిలో గడిపేవాడు.

“పాఠశాలలో వున్నప్పుడే యూరీ విమాన చోదకుడు కావాలని

కలలు కనడం మొదలు పెట్టాడనుకుంటాను" అని అతని తమ్ముడు బోరిస్ అన్నారు. "మా చిన్న నగరంలో, విమాన యానం గురించి, వైమానికుల గురించి భోగట్టా పిల్లలకు పుస్తకాలలో మాత్రమే దొరికేది. కాని యూరీ విమానాల బొమ్మలను ఎక్కడో సంపాదించి, వాటినిబట్టి చిన్న నమూనాలను తయారు చేసే వాడు.

"విమానయానంలో తనకున్న ఆసక్తిని గురించి అతను అట్టే మాటాడేవాడుకాడు. ఈ ఆసక్తే కాకుండా యూరీ ఆటలాడుతుండేవాడు. ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్ బాగా ఆడేవాడు. ఈ రెండు ఆటల్లో దేనినో ఒకదానిని చివరికి తాను ఎంచుకోవాలని ఎప్పుడూ అంటుండేవాడు, సాంకేతిక పాఠశాలలో చదవడానికి సారతోవ్‌కు వెళ్ళినప్పుడు, విమానాలు నడపడం నేర్చుకోవాలనుందని ఒక ఉత్తరంలో వ్రాశాడు."

# వృత్తి పాఠశాలలో

యూరీ దాయాది (కజిన్) ఆంతొనీనా ఇవనోవ్‌స్కయా మాస్కోలో అనేక సంవత్సరాలుగా వుంటోంది.

"యూరీ జీవితానికి సంబంధించిన అతి చిన్న విషయాలు కూడా ప్రతిచోటా ప్రజలు తెలుసుకొనగోరుతున్నారని నాకు తెలుసు. కాని అసాధారణ విషయం ఏదిగాని, మీ పత్రికా రచయితలన్నట్టుగా అబ్బురం కలిగించే విషయం ఏదిగాని నాకు జ్ఞాపకం రావడంలేదు. అతని జీవితమూ, చదువూ వేలాదిమంది సోవియట్ యువజనుల జీవితం, చదువులాంటివే, అతని జీవిత కథ. అతని కాలపు వారి జీవితకథలను—యించుమించు ప్రతి వివరంలోనూ ప్రతిధ్వనిస్తోంది" అంటూ చెప్పిందామె.

"పాఠశాలలో ఆరో ఫారంతో ఉత్తీర్ణుడై, గ్జాట్‌స్కనుండి యూరీ వచ్చినప్పుడు నాభర్త, నేను మాస్కోలో వుంటున్నాము. మేము నాలుగు సంగతులూ మాటాడుకొని, లోహ పరిశ్రమలో అతను ఒక వృత్తి విద్యను చదవాలని నిశ్చయించాము. తన పనిని గురించి నా భర్త చెప్పే

విశేషాలు యూరీకి ఆసక్తి కలిగించాయి. లోహ కార్మికుల వృత్తి పాఠశాలలో చేరడానికి అతను నిర్ణయించుకున్నాడు.

"మర్నాడు మేము ల్యుబెర్ట్సీ ఫాక్టరీ వృత్తి పాఠశాలకొండానికి వెళ్ళాము. ఇది యిప్పుడూ వుంది. మేమక్కడికి వెళ్ళిన రోజునే మొదటి పరీక్షలు మొదలయ్యాయి. మేము చాలా ఆలస్యంగా వెళ్ళాము.

యూరీ చాలా దూరంనుండి వచ్చాడని తెలిసి, ఆ పాఠశాల అధ్యయన శాఖ అధిపతి, చాలా దయగల యువకుడు—దురదృష్ట వశాత్తు ఆయన పేరు మర్చిపోయాను—యూరీని పరీక్షలకు కూచోడానికి అనుమతించాడు. యూరీ రష్యన్, గణితం పరీక్షలు చాలా బాగా ప్యాసయ్యాడు. పాఠశాలలో అతను చేరే సమస్య పరిష్కారం అయిపోయింది. మాస్కో, ల్యుబెర్ట్సీల మధ్య తిరగకుండా, అతనికి పాఠశాల వసతి గృహంలో చోటు దొరికింది."

వృత్తి పాఠశాలలో చదువుతూ వుండగా, యూరీ ఒక సాయంకాల సెకండరీ పాఠశాలలో కూడా చదువు పూర్తి చేసుకుని, పత్రం సంపాదించాడు.

## ఓల్గా పైనున్న నగరానికి

మాస్కోకు చేరువలోని ల్యుబెర్ట్సీ నుండి రష్యన్ మహానది ఓల్గా తీరానికి వెళ్ళింది, యూరీ మార్గం. ఆయన 1951లో సారతోవ్‌కు వెళ్ళాడు. అక్కడ పారిశ్రామిక సాంకేతిక పాఠశాలలో చదువు మొదలుపెట్టాడు. నాలుగేళ్ళతను ఫౌండ్రీ పనిగురించి చదివారు, ప్రతి పరీక్షలోనూ మంచి మార్కులతో ఉత్తీర్ణులయ్యారు. సాంకేతిక పాఠశాలలోనూ, వృత్తి పాఠశాలలోనూ ఆయన ఉన్నత వర్గంలో ఉత్తీర్ణులయ్యారు.

వైమానికునిగా, వాతావరణ విజేతగా అవ్వాలన్న తన బాల్య స్వప్నాన్ని యూరీ ఎన్నడూ మరిచిపోలేదు. ఆయన మొదటిసారిగా తయారు చేసినది విమానం నమూనా కావడంలో ఆశ్చర్యపడవలసిందేమీలేదు. వైమానిక సమాజంలో, తన విరామకాలం అంతా ఆయన గడిపేవారు. దాన్లో ఆయన 1954 లో చేరారు.

ఏ యిబ్బందీ లేకుండా స్వీకరణ సంఘంచే యూరీ స్వీకరింపబడ్డారు. ప్రశ్నలకు ఆయన యిచ్చిన జవాబులు, బాగా శిక్షణ పొందిన కండరాలు, ఆయన నిదానం—యివన్నీ దృఢగాత్రుడైన యీ కుర్రవాడు మంచి వైమానికుడు కాగలడన్న అభిప్రాయం స్వీకరణ సంఘ సభ్యులకు కలిగించాయి.

ఆయన వైమానిక సమాజానికి వారానికి మూడు రోజులు వెళ్ళేవారు. సాంకేతిక పాఠశాల చదువుతూ, వైమానిక సమాజంలో శిక్షణను జోడించడం తేలికేమీ కాదు. కాని గగారిన్‌కు తన కాలాన్ని బాగా ఉపయోగించుకునే నేర్పుంది. ఆయన అన్ని అంశాలలోనూ పరీక్షల్లో ఉత్తీర్ణులయ్యారు.

చాలా వివేకశాలి కావడంవల్ల గగారిన్ విమానం నడిపే ప్రావీణ్యాన్ని చాలా త్వరలోనే సంపాదించారు. ఆయన బోధకుడు ద్మిత్రీ మార్త్యనోవ్ అన్న అనుభవజ్ఞుడైన విమాన చోదకుడు. యూరీ వై ఎ కె—18 విమానాన్ని నడపడం నేర్చుకున్నారు, స్వంతంగా విమానాన్ని నడపడానికి ముందర ఆయన తన బోధకునితో 13 గంటలు మాత్రమే విమానంలో ఎగిరి వెళ్ళారు. ఇది జరిగింది 1955 జూన్‌లో.

## విమాన చోదనా ప్రావీణ్యం, పరిపక్వత

పాత రష్యన్ నగరం ఓరెన్‌బర్గ్‌లో విమాన సేన పాఠశాల ఒకటుంది. దీనిలో చాలామంది ప్రఖ్యాతులైన వైమానికులు శిక్షణను పొందారు. వీరిలో 13 మంది రెండేసి స్వర్ణ తారలను సంపాదించారు. వలెరీ చ్కలోవ్, అనతోలీ సెరోవ్, యింకా ఎంతోమంది ప్రఖ్యాత సోవియట్ వైమానికులు యిక్కడ శిక్షణ పొందారు. అక్కడ, ఓరెన్‌బర్గ్‌కు సమీపంలోని స్టెప్పీల పైని భావి రోదసీ నౌకా చోదకుడు తన ప్రావీణ్యాన్ని పెంపొందించుకున్నారు.

యూరీకి విమాన పాఠశాలలో బోధకులలో ఒకరైన అనతోలీ ఇక్స్ నోవిచ్ అగఫనోవ్ యిలా చెపుతున్నారు :

"ఒక ఉత్తమ విద్యార్థిగా పాఠశాలలో గగారిన్ పేరుపడ్డారు. అతని కెప్పుడూ చాలా మంచి మార్కులు వచ్చేవి. అతను సిద్ధాంత అధ్యయనం పట్ల చాలా శ్రద్ధచూపేవాడు; త్సియొల్కోవ్‌స్కీ, జుకోవ్‌స్కీ, ఛప్లిగిన్ మొదలైన అగ్ర విమానయాన శాస్త్రజ్ఞుల రచనల పట్ల చాలా ఆసక్తి చూపే వాడు. తొలి కృత్రిమ భూఉపగ్రహాలు పంపబడినప్పుడు, సోవియట్ విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల విజయాల గురించి తనకు దొరికిన పుస్తకాలన్నిటినీ చదివేవాడు."

యూరీ పాఠశాలనుండి లెఫ్టినెంట్ హోదాతో పట్టభద్రుడయ్యారు, మొదటి తరగతి వైమానిక యోగ్యతా పత్రం పొందారు. పాఠశాలలో ఆయన క్రీడలలో పాల్గొనేవారు, మంచి వ్యాయామకారునిగా పేరుపడ్డారు, సమగ్రమైన శారీరక శిక్షణను పొందారు. చురుకైన సంఘ సేవకునిగా, మంచి మిత్రునిగా, ఔత్సాహిక కళా బృందం సభ్యునిగా పాఠశాలలో ఆయన పేరు సంపాదించారు.

వైమానిక వృత్తిని ఆయన ఎంచుకున్నందుకు, తల్లి బాధపడితే, ఆయన ఆమెను ఓదార్చి చక్కని ఉత్తరాలు వ్రాశారు :

"అమ్మా ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ముద్దొచ్చే నీ పెద్ద చేతు లంటే నా కెంతో యిష్టం. నీ కళ్ళచుట్టూరా వున్న ముడతలూ, నీ నెరిసిన జుట్టూ నాకెంతో యిష్టం....నా గురించి చింత పెట్టుకోకు...."

వాళ్ళు కలుసుకున్నప్పు డామె, "యూరీ, ఆ పనెలా వుందో చెప్పు" అని అడిగితే, ఆయన ముఖంలో గాంభీర్యం వస్తుంది, గొంతు దృఢతర మవుతుంది. "అమ్మా, నా గురించి చింత పెట్టుకోకు. నేను సో వి య ట్ వైమానికుణ్ని. మన యంత్రాలు నాకు కష్టం కలిగించవు...." అని జవా బిచ్చేవారు.

ఆయనకు యంత్రాల గురించి బాగా తెలుసును. వాటిని సృష్టించిన వారిపైని ఆయనకు విశ్వాసం వుంది. ఆ రోదసీ యాత్రకు ముందరి రోజు

రాత్రి, అంటుచేతనే ఆయన గుండె ప్రశాంతంగా స్పందించింది. తాను భూమికి తిరిగి వస్తానని ఆయన ఎరుగును.

# గగారిన్ కుటుంబం

తక్కిన వారందరిలాగానే ఆయన ప్రతిరోజూ పనికి బయలుదేరి, ఒక చిన్న కూతురుతో వాకిటిలో నడిచేవారు. ఆయన నిగర్వి, ఉల్లాస వంతుడు, దృఢగాత్రుడు. మంచి హాస్యాన్ని మెచ్చుకుని ఆనందించగలరు, క్రీడలన్నా ఉన్నత గణిత శాస్త్రమన్నా శ్రద్ధ, సంగీత సాహిత్యాలంటే అభిమానం.

అక్కడ ఆయన నందరూ ఎరుగుదురు, గౌరవిస్తారు. ఆయనకు గల సానుభూతినిబట్టీ, కళ్ళలో మెరిసే సున్నితమైన చతురతనుబట్టీ, ఆయనను అంతా గౌరవిస్తారు. యూరీ నృత్య నాటకానికిగాని, "బెర్యోజ్కా" సమాజ ప్రదర్శనకు గాని వెళ్ళినప్పుడు, ఆ చతురత స్థానంలో ప్రశంసా భావం కనిపిస్తోంది. నృత్య నాటకం అంటే ఆయనకు ఎంతో ప్రేమ, అయితే ఆయనకు ఆసక్తిగల విషయా లింకా ఎన్నో వున్నాయి. బాస్కెట్ బాల్ కోర్టులో తరచు కనిపించే వాడు. పొట్టిగా వున్నా ఎంతో చురుకుగా ఆయన బంతిని రింగులోనికి ఎత్తి వేసేటప్పుడు కుర్రవాళ్ళు "యూరీ మామా" అని అరిచేవారు.

తన తోటివారికీ, పొరుగువారికీ తెలిసిన యూరీ యిటువంటి వ్యక్తి. తన దేశం పట్ల, ప్రజల పట్ల అపారమైన ప్రేమ, నెమ్మది, నిరాడంబరత ఆయన ముఖ్య గుణాలని అంతా చెప్తారు. నిజమైన రష్యన్ యొక్క కమ్యూనిస్టు యొక్క ఉత్తమ గుణాలివి.

ఆయన భార్య వాలెంతీనా ఇవనోవ్నా కూడా నిరాడంబరత, కలుపుగోలు తనం గల ఆవిడ. ఒక వైద్యశాలలో ఆమె లేబరేటరీ సహాయకురాలు. తన యిద్దరు కుమార్తెలకు—ఎలీనా, మార్చి 7న పుట్టిన గాల్యాకు— తల్లి.

ప్రక్కను స్నేహితురాలుండగా, రెండు హృదయాలు ఒకే శృతిలో మోగుతుండగా జీవిత యాత్ర చేయడం ఎంత చక్కగా వుంటుంది! నాలుగేళ్ళ క్రితం, 1957 మార్చి 9న ఆయన భార్య మిత్రురాలు అయిన వాల్యా ఒక ఛాయాచిత్రంమీద యిలా వ్రాసింది: "యూరీ, మన సుఖానికి మనమే నిర్మాతలమని జ్ఞాపకం పెట్టుకో. విధికి ఎన్నడూ తల వంచకు. తరుణం కోసం వేచి వుండడమన్నది గొప్ప కళ అని జ్ఞాపకం వుంచుకో. ఈ భావాన్ని ఆ గొప్ప సుఖ సమయంవరకూ అట్టి పెట్టుకో."

ఈ మాటలను బహుశా ఆమె ఆ గొప్పరోజున—1961 ఏప్రిల్ 12—జ్ఞాపకం తెచ్చుకుని వుంటుంది. ఆ రోజున ఆమె యూరీ అద్భుత వేగంలో, అన్వేషించబడని ఎత్తులలో, మానవ యోచనా శక్తి యశస్సును చేకూర్చుతూ, సోవియట్ భూమి ప్రతిభకూ, శక్తికీ కీర్తిని చేకూర్చుతూ భూమిని చుట్టి వచ్చారు.

గగారిన్ కుటుంబానికి యీ వసంతం ఎంతో ఆనందదాయకమైనది. మార్చి 9న యూరీ తన 27వ జన్మదినం జరుపుకున్నారు. దానికి రెండు రోజుల ముందర ఆయన కుమార్తె గాలీనా పుట్టింది. కొన్నాళ్ళ తరవాత ఎలీనా రెండో పుట్టినరోజు పండగ. పండగ విందులో స్నేహితులూ, చుట్టాలూ వారి నభినందించారు. ఇప్పుడు యావత్ప్రపంచమూ గగారిన్ కుటుంబాన్ని అభినందిస్తోంది.

# వీరునికి దేశం యిచ్చిన స్వాగతం

ఏప్రిల్ 14న యావత్తు ప్రపంచమూ ఎంతో ఆతృతతో మళ్ళీ మాస్కో వేపుకు దృష్టిని సారించింది. భూగోళాన్ని చుట్టివచ్చిన తొలి రోదసీ నౌకా చోదకుడు యూరీ గగారిన్‌ను, సోవియట్ రాజధాని గౌరవిస్తున్నది. తొలి రోదసీ యాత్రికునికి, సోవియట్ల భూమి ఆనందోత్తేజాలతో స్వాగతం యిచ్చింది.

పతాకాలతో అలంకరింపబడిన వీధుల్లోనూ, చౌకుల్లోనూ వేలాది మంది ప్రజలు గుమిగూడారు. వారా వసంతపు తొలిపూలనూ, గగారిన్ చిత్రాలనూ, సోషలిస్టు వ్యవస్థయొక్క, దాని మహత్తర సృజనాత్మక కృషి యొక్క ఘన విజయంగా చరిత్రలో నిలిచిపోయే యీ మహత్తర కృత్యాన్ని కీర్తించే నినాదాలు గల పోస్టర్లనూ తెచ్చారు.

వ్నుకోవో విమానాశ్రయ భవనం ముఖభాగం అంతటా కప్పి వున్న పెద్ద పతాకాలమీద మొట్టమొదట రోదసిని జయించిన సోవియట్ పౌరుడు యూరీ గగారిన్‌కు హృదయపూర్వకాభివందనలు లిఖింపబడి వున్నాయి. పతాకాలకు ప్రక్కను వి. ఐ. లెనిన్, యన్. యస్. కృశ్చేవ్, వై. ఐ. గగారిన్ చిత్రాలు వేలాడ గట్టబడి వున్నాయి.

మధ్యాహ్నం పన్నెండింటికి సోవియట్ ప్రభుత్వం, కమ్యూనిస్టు పార్టీ నాయకులు, మాస్కో యొక్క, మాస్కో మండలం యొక్క శ్రామిక ప్రజల ప్రతినిధులూ విమానాశ్రయానికి చేరారు, వీర రోదసీ యాత్రికునికి స్వాగతం చెప్పడానికి.

మధ్యాహ్నం పన్నెండున్నరకు నాలుగు ఇంజిన్ల ఇల్యూషిన్–18



రోదసి లోనికి వెళ్ళిన సోవియట్ వైమానిక వీరుడు యూరీ గగారిన్ యాత్ర గురించి
వివరాలను తెలుసుకోడానికి ఒక పత్రికా విక్రయశాల వద్ద గుమికూడిన
ప్రజా సమూహం

విమానం విమానాశ్రయంలో దిగింది; దీనిలో సోచీనుండి నికితా కృశ్చేవ్ వచ్చారు.

పార్టీ, ప్రభుత్వ నాయకులకు ప్రక్కను విమానాశ్రయంలోని వేదిక పైని, వీర రోదసీ నావా చోదకుని భార్య వాలెంతినా గగారినా, స్మొలెన్స్కు మండలంనుండి వచ్చిన ఆయన తలిదండ్రులు, అక్క జెల్లెళ్ళు, అన్న దమ్ములూ నిలబడి వున్నారు. వారందరితో నికితా కృశ్చేవ్ హృదయపూర్వకంగా కరచాలనం చేశారు.

మధ్యాహ్నం 12 గంటల 37 నిముషాలకు, "గగారిన్ విమానం వస్తోంది అన్న ఉద్రేకపు కేకలు విమానాశ్రయంలో మోగాయి. ఐయల్-18 విమానం గగారిన్‌తో, ఏడు ఫైటర్ విమానాలు వెంటరాగా విమానాశ్రయాన్ని సమీపిస్తున్నాయి. అపార విశ్వంలోనికి మానవాళికి మొదట దారి చూపిన మనిషిని తీసుకవస్తోం దది. యూరీ గగారిన్ గౌరవార్థం రచించ బడిన "మాస్కోకు స్వాగతం"అన్న పాటను విమానాశ్రయంలోని బ్యాండ్ వాయిస్తోంటే. విమానం మాస్కో పైని గౌరవ సూచకంగా చుట్టి వెళ్ళింది.

"అది దిగుతుందిక" అంటూ విలేఖరులు తమ ఫోటో కెమేరా లనూ, సినీ-కెమేరాలనూ ఆకాశం వంకకు పెట్టారు.

భూమికి దిగాక, పొడవైన ఎర్ర తివాసి కొన వద్ద విమానం ఆగింది. మేజర్ గగారిన్ విమానంనుండి తొందరగా దిగారు. "హుర్రా" అన్న కేకలూ, బ్రహ్మాండమైన హర్షధ్వానాలూ ఆయనను ఎదుర్కొన్నాయి.

తివాసీ మీద సుమారు నూరు అడుగులు నడిచి మేజర్ గగారిన్ నికితా కృశ్చేవ్‌ను సమీపించి, చేయి ఎత్తి సైనిక వందనం చేసి, యీ దిగువ విధంగా నివేదించారు :

"సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ కామ్రేడ్ ప్రథమ కార్యదర్శీ, సోవియట్ దేశ మంత్రి వర్గాధ్యక్షా,

"కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ అప్ప



రోదసిలోనికి జయప్రదంగా మానవుని యాత్ర గురించి టాస్ సమాచారాన్ని ఆతృతగా వింటోన్న మాస్కో-వాసులు.

గించిన పని నెరవేర్చబడిందని మీకు నివేదించడానికి నేను సంతోషిస్తున్నాను.

"ఏప్రిల్ 12న, వోస్తోక్ సోవియట్ రోదసీనౌక పైని, చరిత్రలో తొలిసారిగా మానవునితో రోదసీ యాత్ర జయప్రదంగా సాధించబడిది.

"రోదసీ నౌకలోని అన్ని పరికరాలూ, సామగ్రి తు. చ తప్పకుండా తప్పులేకుండా పని చేశాయి.

"నేను కులాసాగా వున్నాను, మన పార్టీ. ప్రభుత్వం యిచ్చే యింకే బాధ్యతనైనా నెరవేర్చడానికి సిద్ధంగా వున్నాను. మేజర్ గగారిన్."

నికితా కృష్చెవ్ తన టోపీని తీసివేసి, ఆ వీరుని కౌగలించుకుని తండ్రి కుమారుని ముద్దు పెట్టుకున్నట్టుగా గగారిన్ ముద్దాడారు.

"మీకు అభినందనలు, అభినందనలు!" అని చెప్పారు ఆయన రోదసీ నౌకా చోదకునికి.

కృష్చెవ్ ఆ తరవాత, ఆ వీరుని సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ అధ్యక్షవర్గం సభ్యులకు పరిచయం చేశారు. వారంతా గగారిన్‌ను హృదయపూర్వకంగా అభినందించారు. ఇవయ్యాక తల్లి, భార్య, తండ్రి, అన్నదమ్ములు, అక్క-చెల్లెళ్ళు ఆయనను ప్రేమతో కౌగలించుకున్నారు.

వ్నుకోవో విమానాశ్రయంలో గుమిగూడిన ప్రజలు యీ సమావేశాన్ని ఉద్రిక్త హృదయాలతో చూచారు. వారేకాదు, యావత్తు మాస్కో, యావత్తు సోవియట్ దేశమూ, యించుమించు యావత్తు యూరప్ యీ దృశ్యాన్ని చూసింది. వీరంతా ఆత్రుతగా, ఎంతో సంతోషంతో తన వీర పుత్రుని దేశం గౌరవిస్తూ వుండడం చూశారు.

నికితా కృష్చెవ్, యూరీ గగారిన్, విమానాశ్రయంలో గుమిగూడిన మాస్కోవాసుల ఎదుట వెళ్తోంటే, బ్రహ్మాండంగా "హుర్రా" అన్న ధ్వనులు మోగాయి.

కొన్ని నిమిషాల తరవాత, నికితా కృష్చెవ్, యూరీ గగారిన్,



ప్రపంచానికి తొలిసారిగా సోవియట్ వైమానికుడు యూరీ గగారిన్‌తో రోదసీ నౌక కక్ష్యలో ప్రవేశ పెట్టబడి జయప్రదంగా భూమికి రప్పించబడిందని విని మాస్కో వాసులు బ్రహ్మానంద భరితులైన దృశ్యం.

ఆయన భార్య ఎర్ర గులాబీ దండలతో అలంకరింపబడిన పైకప్పు మడిచి వేసిన నీలపు మోటారుకారులోనికి ఎక్కారు. తరవాత మోటారుకార్ల వరుస మాస్కోకు వెళ్ళడానికి బయలుదేరింది. వ్నుకోవో నుండి రెడ్ స్క్వేర్ దాకా దారంతటా లక్షలాది మంది మాస్కో వాసులు ఉత్సాహంతో, "రోదసీ వీరునికి జై!", "కమ్యూనిస్టు పార్టీకి జై;" అంటూ, రాళ్ళు పెళ్ళగించే నినాదాలు చేశారు.

ఈ పండుగలను జరుపుకోవడానికి సోవియట్ ప్రజలు సమావేశమయ్యే రెడ్ స్క్వేర్‌కు ఆ రోజున అసాధారణమైన ఉత్సాహం వచ్చింది. యూనియన్ రిపబ్లిక్కుల రాజ్య చిహ్నాలతో అలంకరింపబడిన

క్రెమ్లిన్ గోడవెంబడినున్న నిలిచే తావులనిండా అతిథులు కిక్కిరిసి వున్నారు. వారిలో కర్మాగారాల, ఫాక్టరీల కార్మికులు, అగ్రశ్రేణి వ్యవసాయదారులు, విజ్ఞానశాస్త్రజ్ఞులు, సంస్కృతీ రంగంలో పనిచేసేవారు, రాజకీయ వేత్తలు, ప్రముఖులు, సోవియట్ దేశ, రష్యన్ సమాఖ్య, యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్ల సభ్యులు, సోవియట్ దేశపు మార్షల్సు, జనరల్సు, సోవియట్ సేన అధికారులూ వున్నారు. దౌత్య వర్గాల సభ్యులు, విదేశీ అతిథులు కూడా వీరిలో వున్నారు.

ఆ ఛౌక్ అంతా ప్రజలతో కిక్కిరిసి పోయింది. ఆ రాజధానీ శ్రామిక ప్రజల బారుల పైని లెనిన్, పార్టీ, ప్రభుత్వాల నాయకుల, యూరీ గగారిన్ చిత్రాలు, పతాకాలు కొల్లలుగా కనిపించాయి.

లెనిన్-స్టాలిన్ సమాధి వేదిక పైని కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వ నాయకులూ యూరీ గగారిన్, ఆయన భార్య, బంధువులూ వెళ్ళేసరికి ఆ ఛౌకులో బ్రహ్మాండమైన హర్షధ్వానాలూ, "హుర్రా" అన్న కేకలూ మారుమ్రోగాయి.

# యూరీ గగారిన్ ప్రసంగం

ప్రియమైన దేశీయులారా,
ప్రియమైన నికితా సెర్గియేవిచ్,
పార్టీ, ప్రభుత్వ నాయకులారా,

"సామాన్య సోవియట్ విమాన చోదకుడైన నాలో విశ్వాసముంచి ప్రథమ రోదసీ యాత్రను చేసే బాధ్యతాయుతమైన పనిని నాకు అప్పగించినందుకు, నా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీకీ, సోవియట్ ప్రభుత్వానికీ, యావత్తు సోవియట్ ప్రజలకూ, వ్యక్తిగతంగా నికితా సెర్గియేవిచ్, మీకూ నా మనఃపూర్వకమైన కృతజ్ఞతను మొట్టమొదట అర్పిస్తున్నాను.

రోదసి లోనికి బయలుదేరడానికి ముందర మన లెనినిస్టు పార్టీ



తన బాధ్యతను జయప్రదంగా నెరవేర్చినందుకు యూరీ గగారిన్‌ను వ్నుకోవో విమానాశ్రయంలో యన్. యస్. కృష్చెవ్ అభినందిస్తోన్న దృశ్యం. (14 ఏప్రిల్, 1961).

గురించీ, మన సోషలిస్టు దేశం గురించి నేను ఆలోచిస్తున్నాను.

మన ఉజ్జ్వలమైన పార్టీ పట్ల, మన సోవియట్ మాతృభూమి పట్ల మన వీర శ్రామిక ప్రజల పట్ల నాకు గల ప్రేమ నన్ను ఉత్తేజపర్చి, యీ కార్యాన్ని జరపడానికి నాకు అవసరమైన బలాన్నిచ్చింది (పెద్ద పెట్టున హర్షధ్వానాలు).

మన ప్రజల ప్రతిభ, గొప్ప కృషి రోదసీ నౌక "వొస్తోక్"ను సృష్టించాయి; ప్రపంచంలో కల్లా అద్భుతమైన, అతి విశేషమైన, అతి విశ్వసనీయమైన సామగ్రినీ సృష్టించాయి. బయలుదేరినప్పటి నుండి భూమికి దిగేవరకూ, రోదసీ యాత్ర విజయం గురించి నాకు సందేహం లేదు.

రోదసికి సంబంధించిన రహస్యాలను తెలుసుకోటానికి ధైర్యంగా ప్రయాణం చేయటానికి వీలైన రోదసీ నౌకను సృష్టించిన విజ్ఞాన శాస్త్ర

వేత్తలకూ, ఇంజనీర్లకూ, సాంకేతిక నిపుణులకూ, సోవియట్ కార్మికులకూ నా మనఃపూర్వక అభివాదాలను తెలియజేస్తున్నాను. నా కామ్రేడ్స్ అందరికీ, యీ యాత్రకు నన్ను సిద్ధపరిచిన వారందరికీ కూడా కృతజ్ఞుణ్ణి. (హర్షధ్వానాలు).

నా మిత్రులైన రోదసీ నౌకా చోదకులు మన గ్రహం చుట్టూ ఏ సమయంలోనైనా పయనించి రావటానికి సిద్ధంగా వున్నారని నేను నమ్ముతున్నాను. (దీర్ఘ హర్షధ్వనులు). మన సోవియట్ రోదసీనౌకల్లో ఇంతకు మించిన దూరాలకుకూడా ప్రయాణం చేయవచ్చునని నమ్మకంగా చెప్పవచ్చు. నా ప్రియమైన మాతృభూమే ముందుగా రోదసిలోకి చొచ్చుకుపోయినందుకు నేను మహదానందాన్ని పొందుతున్నాను: మొట్టమొదటి విమానం, మొట్టమొదటి కృత్రిమ భూ ఉపగ్రహం, మొట్టమొదటి రోదసీ నౌక, మొట్టమొదటి రోదసీ యాత్ర—ఇవీ నా మాతృభూమి ప్రకృతి రహస్యాలను తెలుసుకోవటంలో సాధించిన విజయాలు: (హర్షధ్వనులు). ఈ విజయాలకు మన కమ్యూనిస్టు పార్టీ మనను ధైర్యంగా ముందుకు తీసుకొనిపోతున్నది. (దీర్ఘ హర్షధ్వనులు).

నా జీవితంలో ప్రతి దశలోనూ, వృత్తి పాఠశాల, పారిశ్రామిక సాంకేతిక పాఠశాల, వైమానిక సమాజం, విమాన సేన పాఠశాల—వీటన్నిట్లో ప్రతి దశలోనూ నాకు పితృస్థానంలో వున్న పార్టీ అభిమానాన్ని ఎల్లప్పుడూ నేను పొందుతూనే వున్నాను (హర్షధ్వనులు).

ప్రియమైన కామ్రేడ్స్, యీ సందర్భంలో ముఖ్యంగా నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్ మన పట్ల, సామాన్య సోవియట్ ప్రజల పట్ల చూపుతూ వచ్చిన గొప్ప పితృవాత్సల్యాన్ని గురించి నొక్కి చెప్పవలసి వుంది. నికితా సెర్గియేవిచ్, నేను భూమికి దిగిన, రోదసినుండి మన మాతృభూమికి తిరిగి వచ్చిన కొద్ది నిమిషాలకే నేను జయప్రదంగా రోదసీ యాత్రను పూర్తి చేసినందుకుగాను మొట్టమొదట అభిమాన పూర్వకమైన అభినందనలను పంపారు. (హర్షధ్వనులు).

ప్రియమైన నికితా సెర్గియేవిచ్, నా పక్షనా, నా తోడి రోదసీ నౌకా

చోదకులనుండీ మీకు చాలా కృతజ్ఞత! (పెద్దపెట్టున హర్షధ్వనులు) సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ 22వ మహాసభకు ప్రథమ రోదసీ యాత్రను అంకితం చేశాము (దీర్ఘ హర్షధ్వనులు).

ప్రియమైన మాస్కో వాసులారా, పెద్దగా స్వాగతం యిచ్చినందుకు మీకు హృదయపూర్వకమైన కృతజ్ఞత. లెనినిస్ట్ పార్టీ నాయకత్వాన మన ప్రియమైన దేశ శక్తి సంపదల పేరిట, మన దేశ యశస్సుకోసరం, మన ప్రజల యశస్సుకోసరం మీలో ప్రతి ఒక్కడూ యెటువంటి సాహస కృత్యాన్ని చేయడానికైనా సిద్ధంగా వున్నాడని నా విశ్వాసం (పెద్ద పెట్టున హర్షధ్వానాలు).

మన సోషలిస్టు దేశం వర్ధిల్లాలి! (పెద్దపెట్టున హర్షధ్వానాలు).

శక్తివంతులైన సోవియట్ మహా ప్రజలు వర్ధిల్లాలి! (పెద్ద పెట్టున హర్షధ్వానాలు).

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీకీ, నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్ నాయకత్వాన లెనినిస్టు కేంద్ర కమిటీకీ జేజేలు! (పెద్దపెట్టునహర్షధ్వానాలు) జయజయధ్వానాలు).

# మొదటి సోవియట్ రోదసీ నౌకా యాత్రికునికి స్వాగత సభలో కృశ్చేవ్ ప్రసంగం, ఏప్రిల్ 14, 1961

ప్రియమైన కామ్రేడ్స్,

ప్రియ మిత్రులారా,

యావత్ప్రపంచ పౌరులారా,

మహదానందంతోనూ గర్వ భావంతోనూ మీముందు నేను ప్రసంగిస్తున్నాను. చరిత్రలో తొలిసారిగా మనుష్యుడు, సోవియట్ పౌరుడు,

సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, కార్మికులు, సాంకేతిక నిపుణులు, ఇంజనీర్లు నిర్మించిన రోదసీ నౌకలో భూమినుండి విడిపడి రోదసిలో ప్రవేశించి, నక్షత్రాల వేపుకు అపూర్వమైన యాత్రను చేశాడు (పెద్దపెట్టున హర్షధ్వానాలు).

రోదసీ నౌక 'ఒస్తోక్' మూడు వందల కిలోమీటర్లకు పైగా ఎత్తు లేచి, భూమి చుట్టూ తిరిగి, సోవియట్ దేశంలోని నిర్ణీత ప్రదేశంలో జయప్రదంగా దిగింది.

ఈ అద్భుతమైన రోదసీ నౌకా చోదకుని, యీ మన సోవియట్ పౌరుణ్ని, యూరీ అలెక్సియేవిచ్ గగారిన్‌ను హృదయపూర్వకంగా మనం కీర్తిస్తాము. (పెద్ద పెట్టున హర్షధ్వానాలూ, జయ జయ ధ్వానాలు). ఆయన ఉన్నతమైన నైతిక గుణాలను—ధైర్య పరాక్రమాలను, చిత్తస్థైర్యాన్నీ ప్రదర్శించారు. సర్వదా చలనంలో వుండే భూమిని, మన యావత్తూ గ్రహాన్నీ ఒకటిన్నర గంటలపాటు మొదటిసారిగా చూచి, దాని బ్రహ్మాండమైన సముద్రాలను, ఖండాలనూ చూసిన వ్యక్తీ ఆయన. గగారిన్ రోదసీ యాత్రలు చేయడంలో ప్రథముడు. మన భూగోళాన్ని చుట్టిన ప్రథముడాయన. అట్లాంటిక్ సముద్రాన్ని దాటి, అమెరికాను కనిపెట్టిన కొలంబస్ పేరు యుగయుగాలుగా జీవిస్తూ వున్నదంటే, రోదసిలోనికి ప్రవేశించి, యావత్తు భూగోళాన్నీ చుట్టి, సురక్షితంగా వచ్చిన మన అద్భుత వీరుడు కామ్రేడ్ గగారిన్ మాటేమిటి! మానవ చరిత్రలో ఆయన పేరు అమరమవుతుంది (పెద్ద పెట్టున హర్షధ్వానాలూ, జయ జయ ధ్వానాలూ).

మన మొదటి రోదసీ యాత్రికుడు ఎన్నెన్ని ఆలోచనలనూ, భావాలనూ భూమికి తీసుక వచ్చారో మనం అవగాహన చేసుకుంటాము. ఈ చరిత్రాత్మకమైన చాకులో యిక్కడ వున్న ప్రతిఒక్కరూ ప్రియ మిత్రమా, కామ్రేడ్ ఎటువంటి గొప్ప ఉద్రేకంతో, గర్వంతో, సంతోషంతో మీకు అభివాదాలర్పిస్తున్నామో అవగాహన చేసుకుంటారు (దీర్ఘ హర్షధ్వానులు).

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ ప్రభుత్వమూ, మన యావన్మంది ప్రజల తరఫున మీరు అసమానమైన వీరకృత్యాన్ని సాధించినందుకు హృదయపూర్వకంగా అభినందించడానికీ,



సోవియట్ పేర మంత్రివర్గాధ్యక్షుడు యన్. యస్. కృశ్చెవ్,
వీర సోవియట్ రోదసీ యాత్రికుడు యూరీ గగారిన్.

గాఢమైన కృతజ్ఞతను వ్యక్తం చేయడానికి అనుమతించండి (పెద్ద పెట్టున హర్షధ్వానాలు).

రాకెట్ నౌక 'వస్తోక్'ను సృష్టించిన శాస్త్రజ్ఞులను, కార్మికులను, ఇంజనీర్లనూ, సాంకేతిక నిపుణులనూ కీర్తించి అభినందించడానికి, రోదసీ

యాత్రను మానవుడు జయప్రదంగా చేయడానికి పరిస్థితులను సృష్టించిన సకల సోవియట్ ప్రజలకు అభినందించడానికికూడా నాకు అనుమతించండి. (హర్షధ్వనులు).

యూరీ గగారిన్ కృత్యానికి మనం గర్విస్తున్నాము; యీ నౌకను నిర్మించి యీ అద్భుత యాత్రను సాధ్యం చేయడానికి త్రికరణ శుద్ధిగా పాటు పడిన శాస్త్రజ్ఞులు, ఇంజినీర్లు, సాంకేతిక నిపుణులు, కార్మికులు వీరిని మనం గాఢంగా ప్రశంసిస్తున్నాము. లక్షలాది మంది కార్మికుల, సమిష్టి రైతుల, మేధావుల, యావన్మంది సోవియట్ ప్రజల కృషి, పరాక్రమం వారి ఉజ్జ్వల కృత్యాలలో సమైక్యమై వున్నాయి. స్వతంత్ర ప్రజల ప్రతిభ ఎటువంటి కార్యాలు చేయకలదో, యీ రోదసీ యాత్ర ద్వారా యింకోసారి ప్రపంచం అంతటికీ మనం చూపాము.

సోవియట్ విజ్ఞాన శాస్త్రం, సాంకేతిక విద్య వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి అత్యున్నత విజయాలను ప్రదర్శించిన ఈనాడు, వెనుదిరిగి మన దేశ చరిత్రను మనం చూసుకోక తప్పదు. మన మనో నేత్రంతో, గడిచిన సంవత్సరాలను మనం చూడకుండా ఊరుకోలేము.

జారు, పెట్టుబడిదారుల, భూస్వాముల పరిపాలనలు మనం కూల దోశాక, మనకు సరిగా జోళ్ళూ దుస్తులు లేకపోయినప్పటికీ అంతర్యుద్ధాగ్ని జ్వాలలలో మన రాజ్యాన్ని మనం రక్షించుకున్నాము. సైనిక వ్యూహ నిపుణులు ఆ రోజుల్లో ఎంతోమంది వుండేవారు. వాళ్ళు చెప్పినట్టుగా "జోళ్ళు లేని సేనలు" ఓడిపోక తప్పదని వాళ్ళు జోస్యాలు చెప్పేవారు! ఈ దుర దృష్ట పంతులైన వ్యూహ నిపుణులు యిప్పుడేరీ?!

మనం మొదట కమ్యూనిస్టు శ్రమదానాన్ని (సుబ్బోత్నిక్స్) మొదలు పెట్టినప్పుడు, కొత్త బ్లాస్ట్ ఫర్నేసులకు పునాదులు వేసి, గనులను నిర్మించి నప్పుడు,—పంచవర్ష ప్రణాళిక, పారిశ్రామికీకరణ, విద్యుద్దీకరణ, సమిష్టీ కరణ, దేశ వ్యాప్త అక్షరాస్యత అన్న ఉజ్జ్వల వాక్కులను ప్రపంచంమీదికి మనం విసిరినప్పుడు, చెట్టుపైపెచ్చుతో చేసిన జోళ్ళు వేసుకునే రష్యా గొప్ప పారిశ్రామిక రాజ్యం ఎన్నడూ కాలేదని జోస్యం చెప్పిన దురహం

కారులైన "సిద్ధాంతులు" ఎందరుండేవారని! ఈ దురదృష్టవంతులైన సిద్ధాంతు లేరీ?!

పూర్వీకులు లేని సామాన్యులైన ఇవాన్లం కాము మనం. అత్యంత అభ్యుదయకాముకులైన వారిచే సృష్టింపబడిన ఉత్తమోత్తమమైన వాటిని మనం ప్రజల సంక్షేమానికి వినియోగించాము. విశాలమైన సోవియట్ పారిశ్రామిక, సమిష్టి క్షేత్ర నిర్మాణ రంగంలో చాలమంది శాస్త్రజ్ఞుల, ఇంజినీర్ల, సాంకేతిక నిపుణుల స్వప్నాలనూ, పథకాలనూ సోషలిస్టు రాజ్యం ఆచరణలో పెట్ట గలిగింది. జారిస్టు రష్యా పరిస్థితులలో వీరు తమ మేధస్సునూ, చేతులనూ వినియోగించాలని అనుకోలేక పోయారు కూడా.

తొలి రోదసీ యాత్రను చేసిన వ్యక్తి ప్రక్కను మనం నిలుచున్నప్పుడు, రోదసీ యాత్ర విషయం కలగని, కాని జారిస్టు ప్రభుత్వంచే ఉరితీయబడిన రష్యన్ విజ్ఞానశాస్త్రవేత్త, విప్లవకారుడు అయిన కిబల్చిచ్‌ను తలుచుకోకుండా వుండలేము. మెండెలెయేవ్, జుకోవ్‌స్కీ, తిమిర్యజెవ్, పావ్లోస్కీ స్మృతికీ, సోవియట్ ప్రజల ఘన కార్యాలతో సంబంధం గల యింకా చాలా మంది గొప్ప శాస్త్రజ్ఞుల స్మృతికీ గౌరవాంజలిని ఘటించకుండా వుండలేము.

విజ్ఞాన శాస్త్రవేత్త, స్వాప్నికుడు, రోదసీ యాత్ర సిద్ధాంతకర్త అయిన కన్‌స్తాంతిన్ ఎదువర్దోవిచ్ త్సియొల్కోవ్‌స్కీ పేరును ప్రత్యేకమైన గౌరవంతో మనం సంస్మరిస్తాము. (హర్షధ్వానులు).

మానవుని మహాస్వప్నాలన్నిటిలోకీ మహాస్వప్నం, రోదసిని జయించాలన్న స్వప్నం. సోవియట్ ప్రజలు యీ స్వప్నాన్ని, యీ దేవతా కథను వాస్తవం చేసినందుకు మనం గర్విస్తున్నాము. (హర్షధ్వానులు).

"సోవియట్ దేశ పౌరుడు" అన్న మాటలు గర్వకారణమైన మాటలు. విదేశాలలో, మన దేశంలో సైతం కొందరు మన గురించి తూలనాడుతూ మాటాడే రోజులుండేవి ఒకప్పుడు. అయితే అప్పుడే వ్లాదిమీర్ మయకోవ్‌స్కీ గర్వభావంతో అన్నారిలాగ :

"చదవండి. నన్ను చూసి
అసూయ పడండి.
నేను సోవియట్ దేశ పౌరుణ్ని."

(దీర్ఘ హర్షధ్వనులు).

నేడీ మాటలు యెంత బలంగా మారుమోగుతాయి! ఎంత అర్థ భరితంగా వున్నాయివి:

ఇటువంటి వీర కృత్యాన్ని చేసే హక్కును యితర జాతులకూ, దేశాలకూ కాదనడంవల్లను కాదు, మనం గర్విస్తున్నది. మనం అంతర్జాతీయవాదులం సోషలిస్టు దేశభక్తి భావంలో ప్రతి సోవియట్ వ్యక్తీ పెరిగి పెద్దవాడవుతాడు. అయితే సోవియట్ వ్యక్తి మనతో శాంతి స్నేహాలతో జీవించడానికి సిద్ధంగా వున్నవారందరితో తన విజ్ఞాన సంపదనూ, తన సాంకేతిక, సాంస్కృతిక జ్ఞానాన్ని కలసికట్టుగా అనుభవించడానికి కూడా సిద్ధంగా వున్నాడు. (హర్షధ్వనులు).

సోవియట్ కార్మికులు, సమిష్టి క్షేత్ర రైతాంగం, పాటుపడే మేధావులూ పూర్వపు జారిస్టు రష్యా శ్రామికులమైన మనకు కార్మికవర్గ అమర నాయకుడు వ్లాదిమీర్ ఇల్యిచ్ లెనిన్, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన అక్టోబరు సోషలిస్టు విప్లవాన్ని జరిపే మ హా గౌ ర వం లభించినందుకు గర్విస్తాము. (దీర్ఘహర్షధ్వనులు).

చరిత్రలో సాటిలేని మహా కార్యం అది. కార్మిక వర్గమూ, ప్రజలూ యీ మహాకార్యాన్ని నిర్వర్తించడానికి అపార ధైర్య సాహసాలనూ, తమ లక్ష్యాల, సమస్యల గురించి గాఢమైన అవగాహననూ ప్రదర్శించవలసి వచ్చింది. ఎంత పెద్దవైనా కార్మికవర్గం కష్టాలకు వెనుదియ్యలేదు. అది అన్నిటికంటె గొప్పదైన విప్లవాన్ని జరిపింది; ఆర్థికంగా వెనుకబడిపోయిన, యించుమించు పూర్తిగా నిరక్షరాస్యమైన, జారిజంచేత పెట్టుబడిదారీ విధానంచేత అణచి వెయ్యబడిన ప్రజలు గల దేశంలో అధికారాన్ని చేపట్టింది.



లక్షలాది మంది మాస్కో పౌరులు, విమానాశ్రయం నుండి మాస్కో రెడ్‌స్క్వేర్‌కు వెళ్లుతుండగా రోదసీ వీరుని చూడడానికి వీధుల్లోనికి వచ్చారు.

వర్తమాన భవిష్యత్కాలాలలో ఉన్నత కృత్యాలు చేయాలని కలలు గనడానికి వ్యవధిలేదనిపించే ఆ పరిస్థితులలో; యుద్ధాన్ని యెలా అంతం చేయడం, పాత రష్యా గాయాలను మాన్పడం ఎలాగ అని ఆలోచన చేయడం అవసరమైన పరిస్థితులలో, మహా పురుషుడు లెనిన్ అచంచలమైన విశ్వాసంతో సోషలిజం కమ్యూనిజం జయించడం తథ్యమని చెప్పారు. విప్లవం ద్వారా, కార్మికవర్గం విజయం ద్వారా, శ్రామికవర్గ నియంతృత్వ స్థాపనద్వారా, మన దేశంలోని సకల ప్రజల విప్లవకర విముక్తి ద్వారా సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతం చెయ్యడానికి చర్యలు తీసుకున్నారు ఆయన.

పెట్టుబడిదారీ దాస్యం నుండి ప్రజలు పూర్తిగా విముక్తి చెందినప్పుడు మాత్రమే, ప్రజలు నిజంగా స్వతంత్రులైనప్పుడు మాత్రమే, భౌతిక ఆత్మిక శక్తులన్నీ శ్రామిక ప్రజల శ్రేయస్సుకు ఉపయోగింపబడినప్పుడు మాత్రమే మానవజాతికి నవశకం ఆవిర్భవిస్తుందని లెనిన్ పూనికతో పదే పదే వివరించారు; (హర్షధ్వనులు).

రష్యా కార్మికవర్గం మహాకృత్యం, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన అక్టోబరు విప్లవాన్ని జరిపిన మన ప్రజల విప్లవకర సృజనాత్మక సామర్థ్యానికి ఉత్తేజకరమైన దృష్టాంతంగా యుగయుగాలు నిలిచిపోతుంది.

సోషలిజం అపారమైన అభివృద్ధికి మన దేశానికి అవకాశం కలిగించింది. పూర్వపు నిరక్షరాస్యమైన రష్యా—దీనిని కొందరు తూలనాడేవారు, ఆటవిక రాజ్యమనేవారు—43 ఏళ్ళలో సోవియట్ ప్రభుత్వం క్రింద, ఉజ్జ్వలమైన మార్గంలో ప్రవేశించింది. మన దేశం కక్ష్యలో ప్రవేశించిన రోదసీ నౌకను మొదట సృష్టించింది, రోదసి లోనికి మొదట ప్రవేశించింది. ప్రపంచంలోని స్వతంత్ర ప్రజలందరిలోకీ స్వతంత్రులైన సోవియట్ ప్రజల నిజమైన స్వాతంత్ర్యానికి యిది గొప్ప తార్కాణం కాదా? (పెద్దపెట్టున హర్షధ్వానాలు).

రోదసీ నౌకను పంపడానికీ, జయప్రదంగా భూమికి దింపడానికీ పరిస్థితులన్నిటినీ సృష్టించి, ఆర్థికంగానూ రాజకీయంగానూ విముక్తి



వ్నుకోవో విమానాశ్రయంనుంచి రెడ్ స్క్వేర్‌కు వెళ్తూ యన్. యస్. కృశ్చెవ్, ప్రథమ రోదసీ యాత్రికుడు యూరీ గగారిన్, ఆయన సతీమణి.

పొంది నిజంగా ఒక దేశం స్వతంత్రమైనప్పుడు ఏమి సాధించగలదో మనం చూశాము. ఒక్క రొట్టె పిసరు కూడా లేనివారిని స్వేచ్ఛగా ధనికులు దోచుకుని, "స్వేచ్ఛా ప్రపంచం" అని పిలువబడేవి కావు, నిజమైన స్వతంత్ర దేశాలు. అందరు స్త్రీ పురుషులూ పాటుపడి, సకల భౌతిక ఆత్మిక లాభాలకు సకల ప్రజలకూ అవకాశాలు గల దేశాలే నిజమైన స్వతంత్ర దేశాలు.

మానవాళి పరిణామంలో మన రోదసీ విజయం ప్రముఖమైన ఘట్టం. ఈ విజయం లెనినిస్టు భావాలకు యింకో విజయం, మార్క్సిస్టు-లెనినిస్టు భావాలు నిర్దుష్టమైనవనడానికి తార్కాణం. ఈ మానవ ప్రతిభా విజయం, అక్టోబరు సోషలిస్టు విప్లవం సృష్టించిన పరిస్థితులలో సోవియట్ దేశ ప్రజలు సాధించిన ప్రతి ఒక్కదానియొక్క ఉజ్జ్వల ఫలితాలకు స్వరూపం, విస్పష్టమైన వివరణ. ఈ గొప్పకార్యం, కమ్యూనిజం వైపుకు మన దేశ పురోగతిలో ఒక ముందడుగును సూచిస్తుంది. (దీర్ఘ హర్షధ్వనులు, జయజయ ధ్వానాలు).

అక్టోబరు విప్లవంతో 1917లో ప్రారంభమైన సోషలిజం నిర్మాణాన్ని జయప్రదంగా పూర్తిచేసి, మహా పురుషుడు లెనిన్ చూపిన బాటను కమ్యూనిజం వేపుకు మనం ధైర్య విశ్వాసాలతో పురోగమిస్తున్నామని సగర్వంగా, అచంచల విశ్వాసంతో ప్రపంచానికి చాటుతున్నాము. మన దారినుంచి మనలను తప్పించే శక్తి ప్రపంచంలో ఏదీ లేదని మనం చెపుతాము. విజయం మనదే, యిది అత్యంత ఉదాత్తమైన, అత్యంత ఉజ్జ్వలమైన విజయ మవుతుంది. (దీర్ఘ హర్షధ్వనులు). దీని అర్థం కొంత మంది ప్రజలు ఇంకొంతమంది మీద పెత్తనం చేయడమనికాదు, ఒక దేశం యింకో దేశం మీద, లేకపోతే యింకొన్ని దేశాల మీదా, ఒక జాతి, యింకోజాతిమీదా పెత్తనం చేయడమని కాదు. ఇది ప్రపంచ ప్రజలందరికీ లాభాన్ని చేకూర్చుతుంది. (హర్షధ్వనులు).

కమ్యూనిజంకొరకు ప్రజల ఉద్యమం, ఆ మహా లక్ష్యం కొరకు ప్రజల ఉదాత్త ఆశాభావాలు—వీటిని కించపరచడానికీ, అడ్డడానికీ సాధ్య పడదు. ఈ ఉద్యమం బ్రహ్మాండమైన, అజేయమైన శక్తిని పొందింది. ఈ మానవ పరిణామ మహాక్రమాన్ని ఆపగల అడ్డంకులేవీ లేవు. సోవియట్ ప్రజలు, సోషలిస్టు దేశాలూ, తమ విజయాన్ని యింకాపొందని, దోపిడీ పీడనల పైని ప్రగతి విజయంకోసం గట్టిగా పోరాడుతోన్న దేశాల ప్రజలతో పాటుగా, సర్వ ప్రపంచ ప్రజలూ జయిస్తారు, కమ్యూనిజం మహా సౌధాన్ని నిర్మిస్తారు. ఇది మానవాళికి వరప్రసాదం, దాని పరిణామ శిఖరం అవుతుంది. (హర్షధ్వనులు).

కామ్రేడ్స్, ఈ సందర్భాన, రోదసీ యాత్ర వల్ల గొప్ప ఆనందాన్నీ, సంతోషాన్నీ పొందే ప్రపంచ విజ్ఞాన శాస్త్రజ్ఞులకు మన జేజేలు, యావత్ప్రపంచ విజ్ఞాన శాస్త్రంతో సన్నిహిత సంబంధంతో సోవియట్ విజ్ఞాన శాస్త్రం పెంపొందుతోంది.

రోదసీ నౌక 'ఓస్తోక్' యాత్రను, రోదసి లోనికి వెళ్ళిన తొలి విహంగమని చెప్పవచ్చును. మన అనేక స్పూట్నిక్కులు, రోదసీ అన్వేషణలూ జరిగాక అది వెళ్ళింది. రోదసీ విజయం కొరకు మన దేశంలో




రెడ్ స్క్వేర్లో శ్రామిక ప్రజల ప్రదర్శన

జరిగిన బ్రహ్మాండమైన వైజ్ఞానిక సాంకేతిక కృషి ఇది సహజ పరిణామం.

ఈ కృషిని మనం భవిష్యత్తులో కూడా సాగిస్తాము. రాను రాను యెక్కువమంది సోవియట్ ప్రజలు రోదసిలోకి అన్వేషించబడని కొత్త మార్గాల్లో వెళ్ళి, మరింతగా ప్రకృతి రహస్యాలను కనుగొంటారు; వాటిని మానవ సేవకు, మానవ సంక్షేమానికీ, శాంతి సేవకూ వినియోగిస్తారు.

శాంతి సేవకు వినియోగిస్తామన్న దానిని మనం నొక్కి చెప్పుతున్నాము. మనిషి ఏర్పరిచే కార్యక్రమాలను యెంతో ఆశ్చర్యకరమైన లక్ష్యశుద్ధితో నెరవేర్చే రాకెట్లను, మారణ పదార్థాల మోయుటకు ఉపయోగించడం సోవియట్ ప్రజల అభిమతం కాదు.

ప్రపంచ ప్రభుత్వాలకు మనం యింకోసారి యిలా విజ్ఞప్తి చేస్తున్నాము: విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు యెంత బ్రహ్మాండంగా అభివృద్ధి చెందాయంటే, వాటిని దుష్టకార్యానికి ఉపయోగించినట్టయితే యెటువంటి వినాశనం చేయగలవంటే, నిరాయుధీకరణ కొరకు సాధ్యమైన అన్ని జాగ్రత్తలు తీసుకోవడం అవసరమవుతోంది. అతి కచ్చితమైన అంతర్జాతీయ నియంత్రణతో సార్వత్రిక సంపూర్ణ నిరాయుధీకరణ, రాజ్యాల మధ్య శాశ్వత శాంతి స్థాపనకు మార్గం. (పెద్దపెట్టున హర్షధ్వనులు).

మనం మన మొదటి స్పుత్నిక్కులను పంపినప్పుడు, సముద్రానికావలనున్న దేశంలోని వి వే క హీ ను లు కొందరు, అది నమ్మలేకపోయారు. అప్పుడు, అటువంటి హ్రస్వదృష్టిగలవారు, మందబుద్ధులూ వున్నారు. కాని యిప్పుడు మనం, నేరుగా ఆకాశంలోనుంచి మన వద్దకు తిరిగివచ్చిన ఒక వ్యక్తిని మనం నిజంగా తాకగలం! (హర్షధ్వానాలు).

మా ప్రియమైన యూరీ, మళ్ళీ యింకోసారి మిమ్ములను కౌగలించుకోనివ్వండి, మీ తోటి పనివారికీ, మీ ఘనకార్యానికీ మా హృదయపూర్వకమైన అభినందనలను మీ ద్వారా అందజేయనివ్వండి (క్రుశ్చెవ్ గగారిన్‌ను కౌగలించుకొని ముద్దు పెట్టుకున్నారు. పెద్దపెట్టున హర్షధ్వానాలు హాలంతటా ప్రతిధ్వనించాయి. "కమ్యూనిస్టు పార్టీ చిరస్థాయి యగుగాక," "గగారిన్‌కు జే" అన్న నినాదాలు).

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్యకు మీరు కీర్తిని సంపాదించారు. మన మాతృదేశం ఎన్నడూ మీ మహత్తర కార్యాన్ని మర్చిపోదు. అది మీ పేరును తన చరిత్రలో లిఖిస్తుంది. (హర్షధ్వానాలు).

ప్రపంచపు మొదటి రోదసీ నౌకా చోదకుడు సోవియట్ పౌరుడయినందుకు మనం గర్విస్తున్నాము. యూరీ అలెక్సీయేవిచ్ పెరిగి ఒక సోవియట్ పాఠశాలలో చదువుకున్నారు, ప్రజా జీవితంలో ఆయన ఎక్కువగా పాల్గొన్నారు, క్రియాశీలమైన యువ కమ్యూనిస్టు సంఘ సభ్యునిగా వుండేవారాయన. ఇప్పుడాయన ఒక కమ్యూనిస్టు, లెనిన్ మహత్తర పార్టీ సభ్యుడు! (పెద్దపెట్టున హర్షధ్వానాలు).



మహోత్సాహంగా వున్న శ్రామిక ప్రజలు రెడ్ స్క్వేర్‌లో యూరీ గగారిన్‌కు ఘనమైన స్వాగతమిచ్చిన దృశ్యం.

సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గం ఆయనకు ఉన్నతమైన సోవియట్ దేశ వీర బిరుదాన్ని యిచ్చిందని మీకు చెప్పడానికి నాకు సంతోషంగా వుంది. (పెద్దపెట్టున దీర్ఘ హర్షధ్వానాలు. జయజయధ్వానాలు. "గగారిన్‌కు జై").

"సోవియట్ దేశ రోదసీ నౌకా చోదకుడు" అన్న విశిష్టమైన బిరుదును మొదట పొందినది కూడా మీరే. (పెద్దపెట్టున హర్షధ్వానాలు).

మాస్కోలో యీ వీరుని అర్ధ విగ్రహం ఆవిష్కరింపబడుతుంది.

ప్రపంచానికి తొలి మానవ రోదసీ యాత్ర గౌరవార్థం ఒక ప్రత్యేకమైన పతకం జారీ చేయబడుతుంది. (పెద్దపెట్టున హర్షధ్వానాలు).

యూరీ తల్లిదండ్రులను నేను అభిమాన పూర్వకంగా అభినందిస్తున్నాను. ఇటువంటి వీర కృత్యాన్ని జరిపి మన దేశానికి కీర్తి తెచ్చిన యిటువంటి పుత్రుని కొడుకును పెంచినందుకు అన్నా తిమొఫియేవ్నాను, అలెక్సే ఇవనోవిచ్ గగారిన్‌ను అభినందిస్తున్నాను. (పెద్దపెట్టున దీర్ఘ హర్షధ్వానాలు).

యూరీ అలెక్సియేవిచ్ భార్య వాలెంటీనా ఇవనోవ్నాకు నా అభిమాన పూర్వకమైన అభినందనలు. ఈమె మంచి సోవియట్ మహిళ. యూరీ అలెక్సియేవిచ్ రోదసిలోనికి వెళ్తున్నారని యీమెకు తెలుసును, కాని ఆమె ఆయనను నిరుత్సాహపరచలేదు. అంతేగాక, యిద్దరు చిన్న బిడ్డల తండ్రి అయిన తన భర్తను యీ మహత్తర కార్యాన్ని సాధించి రమ్మని ఆమె మనసారా పంపించింది. (పెద్దపెట్టున దీర్ఘ హర్షధ్వానాలు).

రోదసీ యాత్రకు ముందర యూరీ అలెక్సియేవిచ్‌తో ఎడబాటు, ఆమె జీవితంలో కడపటిది కాదని ఎవ్వరూ పూర్తిగా హామీ యివ్వలేరని జ్ఞాపకం పెట్టుకోండి. వాలెంతీనా ఇవనోవ్నా ధైర్యమూ, యీ సాటిలేని రోదసీ యాత్రకు గల బ్రహ్మాండమైన ప్రాముఖ్యాన్ని ఆమె గుర్తించడమూ ఆమెకు మహత్తరమైన ఆత్మ గలదని తెలియజేస్తాయి. (దీర్ఘ హర్ష ధ్వనులు).

ఈమె నిజమైన సోవియట్ మహిళ. నెక్రసోవ్, పుష్కిన్, మన యితర రచయితలూ రష్యన్ మహిళల గురించి ఎంతటి ప్రేమాదరాలతో వ్రాశారో జ్ఞాపకం తెచ్చుకోండి. నేడు, రష్యన్ స్త్రీలు అంటే సోవియట్ మహిళలు. వాలెంటీనా ఇవనోవ్నా తన చక్కని వర్తనను, తన దీక్షను, ఆమె సోవియట్ దేశభక్తి అవగాహనను ప్రదర్శించింది. (దీర్ఘ హర్ష ధ్వనులు).

కామ్రేడ్స్ : సోవియట్ ప్రజలు ఒక నూతన విజయోత్సవాన్ని, శ్రమ జీవన విజ్ఞానశాస్త్ర యోచనల విజయోత్సవాన్ని జరుపుకుంటున్నారు.



శ్రామిక ప్రజల ప్రదర్శన, సభ సమయంలో సమాధిపైన యూరీ గగారిన్, క్రుశ్చేవ్.

దీక్షతో కూడిన తీవ్ర కృషి ఫలితంగా మన దేశ ప్రజలు దీనిని సాధించారు. సోవియట్ ప్రజలు జాతీయార్థికాభివృద్ధికీ, సాంకేతిక విజ్ఞాన శాస్త్రాభివృద్ధికీ దీర్ఘ కాలం పాటుపడి, మానవునితో రోదసీ నౌకను తొలిసారిగా పంపి గౌరవార్హు లయ్యారు. ఈ అమర కృత్యం, యీ గణనీయమైన కార్యం మానవజాతి సాధించిన అత్యంత మహత్తర కార్యంగా కలకాలం నిలిచి పోతుంది. (పెద్ద పెట్టున హర్షధ్వానులు).

కాని విజయం మన దీక్షను, ఆర్థిక వ్యవస్థను యింకా అభివృద్ధి పరచడానికీ, వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధికీ పట్టుదలనూ, కృషినీ సడలించ కూడదు. కమ్యూనిస్టుపార్టీ 21వ మహాసభ సూచించిన కమ్యూనిజానికి పుష్టమైన భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మించేందుకు కర్తవ్యాలు బ్రహ్మాండమైనవి. అవి గొప్ప చరిత్రాత్మక ప్రాముఖ్యం గలవి. సప్తవర్ష ప్రణాళికను నెరవేర్చి, తత్ఫలితంగా మన యావత్తు ఆర్థిక వ్యవస్థ, విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలలో ఒక నూతనోద్వేగాన్ని తీసుక వచ్చి; అత్యంతంగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశమైన అమెరికా ఆర్థిక స్థాయిని అధిగమించి;

వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధిలో మన ఆధిక్యతను పలురెట్లుగా పెంచడం మనకు సాధ్యమయ్యేలాగా చేయాలి.

సప్తవర్ష ప్రణాలికను సఫలం చేయడంవల్ల, పెట్టుబడిదారీ ప్రపంచం చేరుకున్న చివరి మెట్టును దాటడానికి చేరువగా వున్న కాలాన్ని మనం సమీపించి; యిప్పుడు మనం రోదసిలోనికి చొచ్చుకపోయినట్టుగానే మన ఆర్థికాభివృద్ధి విషయంలోనూ, ప్రజల అవసరాలను ఈడేర్చడం విషయం లోనూ, మనం ముందుకు చొచ్చుకపోతాము. పెట్టుబడిదారీ ప్రపంచంలో అత్యధికంగా అభివృద్ధిచెందిన దేశాలలోకంటె సోవియట్ ప్రజల భౌతిక, సాంస్కృతికావసరాలు యెక్కువగా ఈడేర్చ బడతాయి.

అందుచేత, కామ్రేడ్స్, మన ఘనమైన విజయాలు మన దీక్షను నీరస పరచకూడదు; విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలను పెంపొందించడంలో మనకు గల అవకాశాలను గరిష్ఠ ప్రమాణంలో వినియోగించడానికి మన వాంఛను నీరస పర్చకూడదు. మన పార్టీ ప్రతిపాదించిన పారిశ్రామిక, యావత్తు దేశ ఆర్థిక యితోధికాభివృద్ధి సమస్యను జయప్రదంగా పరిష్కరించేందుకుగాను, మనం సర్వం ప్రజా సేవకు వినియోగించాలి.

గ్రామీణ కమ్యూనిస్టులను, యువ కమ్యూనిస్టు సంఘ సభ్యులనూ, సమిష్టి క్షేత్రాలలో పనిచేసే స్త్రీ పురుషులనూ, ప్రభుత్వ క్షేత్రాలలో పనిచేసే వారినీ, వ్యవసాయంలో పనిచేసే ప్రతి ఒక్కరినీ ఎదుర్కొంటోన్న సమస్యలు, ప్రత్యేకంగా ఘనమైనవి. వ్యవసాయ స్థాయిని మనం యెంతగా పెంచాలంటే, అది ఎప్పుడూ పరిశ్రమలకు దీటుగా వుండేటట్టుగా చేయాలి.

ఈ వ్యవసాయపు పనులలో వసంతం చాలా ముఖ్యమైన కాలం. సప్తవర్ష ప్రణాలిక యొక్క యీ మూడవ ఏడాదిలో, వ్యవసాయాన్ని పెంపొందించడంలో మన సామర్థ్యాన్ని ముఖ్యంగా మనం ప్రదర్శించాలి. నానాటికీ పెరుగుతోన్న ప్రజల అవసరాలను వ్యవసాయం పూర్తిగా యీడేర్చేందుకు, పొలాలలో పని చేసేవారంతా శక్తివంచన లేకుండా పాటుపడాలి.

కామ్రేడ్స్! మన దేశ చరిత్రలో అద్భుతమైన పుటలు ఎన్నో వున్నాయి. లక్షోపలక్షల మంది సోవియట్ ప్రజల కృషి, ఉత్తేజం, ప్రతిభ, పట్టుదల, ధైర్యం వీటిని వ్రాశాయి.

నవజీవన నిర్మాతలు, కమ్యూనిజం నిర్మాతలు అయిన మన అద్భుతమైన సోవియట్ ప్రజలు చిరస్థాయి యగుదురు గాక, వర్ధిల్లుదురు గాక ! (పెద్ద పెట్టున హర్షధ్వానాలు).

మానివాళి పరిణామంలో అక్టోబరు విప్లవం ఒక నవశకాన్ని ఉదయింపజేసిన దేశమైన మన సోషలిస్టు మాతృదేశం చిరస్థాయి యగుగాక, వర్ధిల్లు గాక ! (పెద్ద పెట్టున హర్షధ్వనులు).

కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు మాతృ దేశ మహానేత, సంస్థాపకుడు వ్లాదిమీర్ ఇల్యిచ్ లెనిన్‌కు జై ! (పెద్ద పెట్టున దీర్ఘ హర్షధ్వానాలు, జయ జయధ్వానాలు).

లెనిన్ ప్రతిభ కమ్యూనిజానికి మన బాటపైని వెలుగులను వెదజల్లుతుంది, సకల మానవాళి శాంతి సౌఖ్యాల పేరిట కొత్త వీర కృత్యాలకు మనలను ఉత్తేజపరుస్తుంది ! (పెద్ద పెట్టున హర్షధ్వనులు).

కమ్యూనిజం నిర్మాతలైన సోవియట్ దేశ ప్రజలు చిరస్థాయి యగుగాక ! (పెద్ద పెట్టున దీర్ఘ హర్షధ్వనులు. జయజయ ధ్వానాలు).

# క్రెమ్లిన్ భవనంలో స్వాగతం

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గమూ, సోవియట్ దేశ మంత్రివర్గమూ 1961 ఏప్రిల్ 14న క్రెమ్లిన్ భవనంలో, రోదసిలోనికి తొలి మానవుని యాత్ర జయప్రదం కావడానికి తోడ్పడిన విజ్ఞాన శాస్త్రజ్ఞులు, ఇంజినీర్లు, సాంకేతిక నిపుణులు, కార్మికులు చేసిన మహత్తర కార్యం గౌరవార్థం, ప్రపంచపు మొదటి రోదసీ నౌకా చోదకుడైన యూరీ అలెక్సియేవిచ్ గౌరవార్థం స్వాగతాన్ని ఏర్పాటు చేశాయి.

తమ మేధా కృషితోనూ, నైపుణ్యంతోనూ రోదసీ నౌక వోస్తోక్‌ను నిర్మించిన వారితోనూ, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గం సభ్యులతోనూ, సుప్రీం సోవియట్ సభ్యులతోనూ, సోవియట్ దేశ

మంత్రులు, రష్యన్ సమాఖ్య మంత్రులతోనూ, ప్రభుత్వ సంస్థల అధ్యక్షులతోనూ, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యులతోనూ, ప్రత్యామ్నాయ సభ్యులతోనూ, సోవియట్ దేశపు మార్షల్స్ తోనూ, మాస్కో, మాస్కో మండల పార్టీ, ప్రభుత్వ సంస్థల నాయకులతోనూ, కార్మిక ప్రజల ప్రతినిధులతోనూ, ప్రసిద్ధ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, కళాకారులు, సాంస్కృతిక రంగంలో పనిచేసే వారితోనూ, ప్రజా సంస్థల ప్రతినిధులతోనూ గియోర్గియేవ్‌స్కీ మందిరం నిండిపోయింది.

స్వాగత ప్రారంభానికి కాస్త ముందర యన్. యస్. కృశ్చెవ్, వీర రోదసీ నౌకా చోదకుడు యూరీ గగారిన్, ఆయన భార్య వాలెంటీనా, ఆయన తలిదండ్రులూ క్రెమ్లిన్ భవనంలో ప్రవేశించి, గియోర్గియేవ్‌స్కీ మందిరంలో ప్రవేశించారు. (పెద్ద పెట్టున దీర్ఘ హర్షధ్వానాల మధ్య).

సోవియట్ దేశ వీర బిరుదం, సోవియట్ దేశ రోదసీ నౌకా చోదకుడన్న బిరుదం యూరీ గగారిన్‌కు ప్రసాదిస్తూ సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గం చేసిన నిర్ణయాలు చదువబడ్డాయి. గియోర్గియేవ్‌స్కీ మందిరంలో బ్రహ్మాండమైన హర్షధ్వానాలూ, జయ జయ ధ్వానాలూ మారు మ్రోగాయి. వాద్య బృందం మ్రోగింది.

గగారిన్‌కు ఆర్డర్ ఆఫ్ లెనిన్‌నూ, సోవియట్ దేశ వీర స్వర్ణతార పతకాన్నీ బహూకరిస్తూ బ్రెజ్నేవ్, యీ సంతోషకరమైన బాధ్యతలను నెరవేర్చుతున్నందుకు ఆనందిస్తున్నానని చెప్పాడు. గగారిన్ ఎంతో గొప్ప కార్యాన్ని సాధించాడనీ, యిది సోవియట్ ప్రజలకు కమ్యూనిజం ప్రసాదించే ఉజ్జ్వలమైన ప్రతి ఒక్కదానికీ, ఉదాత్తమైన ప్రతి ఒక్కదానికీ చిహ్నమని కూడా బ్రెజ్నేవ్ అన్నాడు.

ప్రత్యుత్తరం చెపుతూ యూరీ గగారిన్ "మన పార్టీ, మన ప్రభుత్వమూ, సోవియట్ ప్రజలందరూ చూపిన అభిమానానికి నేనెంతో ఆనందిస్తున్నాను. సోవియట్ ప్రజల యశస్సుకొరకు నేను చేసిన కార్యానికి గర్విస్తున్నాను" అని అన్నారు.

సమావేశంలో యన్. యస్. కృశ్చెవ్ ప్రసంగించారు. యూరీ



సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గ సభాపతి యల్. బ్రెజ్నెవ్, గగారిన్ యూనిఫారానికి ఆర్డర్ ఆఫ్ లెనిన్‌నూ, సోవియట్ దేశ వీర స్వర్ణ పతకాన్ని గుచ్చుతోన్న దృశ్యం.

గగారిన్ చేసిన అపూర్వమైన వీర కృత్యానికి సోవియట్ ప్రజలు గర్వ పడుతున్నారని ఆయన అన్నారు. ఈ కృత్యం సోవియట్ విజ్ఞాన శాస్త్రం, ఇంజనీరింగ్‌ల వైభవ వికాసాలను చూపుతుంది. ఈ కృత్యం ఒక దేశం యింకో దేశంపైని పెత్తనం చేయడానికి దారితీయదని క్రుశ్చేవ్ ప్రకటించారు. ఇది శాంతికొరకు ఉద్దేశింపబడింది. సార్వత్రిక సంపూర్ణ నిరాయుధీకరణం ఒక్కటే ప్రపంచ శాంతిని స్థాపింపగలుగుతుందని సోవియట్ ప్రభుత్వాధిపతి చెప్పి, సోవియట్ ప్రభుత్వం సంతోషపూర్వకంగా నిరాయు



క్రెమ్లిన్‌లో జరిగిన స్వాగతంలో (ఏప్రిల్ 14, 1961) గగారిన్‌తో కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వ నాయకులు.

పై వరుసలో (కుడినుండి ఎడమకు): యఫ్. ఆర్. కోజ్లోవ్, యల్. ఐ. బ్రెజ్నెవ్, వి. ఐ. గగారినా, వై. ఏ. గగారిన్, యన్. యస్. కృశ్చేవ్, ఏ. టి. గగారినా, ఎ. ఐ. గగారిన్, కె. ఇ. ఒరొషిలోవ్, ఆర్. వై. మలినోవ్‌స్కీ.

(దిగువ వరుసలో) బి. ఏ. గగారిన్, ఎ. ఐ. గగారినా, వి. ఎ. గగారిన్, జడ్. ఏ. గగారినా.

ఖీకరణ ఒడంబడికపైని చేవ్రాలు చేసి, ఆ విధంగా అణిరాయుధోత్పత్తిని అంతం చేస్తుందన్నాడు.

అంతర్గ్రహ యాత్రాకాలం మారంగా లేదన్న విశ్వాసాన్ని సోవియట్ ప్రభుత్వాధిపతి వెలిబుచ్చాడు. మానవ హేతుశక్తి, ప్రతిఫల విజయానికీ, తొలి రోదసీ యాత్రికుడు యూరీ గగారిన్‌కూ; తమ కృషి ద్వారా మానవుని యాత్రకొరకు రోదసీ నౌకను నిర్మించి, జయప్రదంగా దానిని పంపి, సురక్షితంగా భూమికి దానిని తిరిగి తీసుక వచ్చిన విజ్ఞాన శాస్త్రజ్ఞులకూ, ఇంజినీర్లకూ, సాంకేతిక నిపుణులకూ, కార్మికులకూ ఆయన శుభాకాంక్ష లర్పించారు.

దౌత్యవర్గాల పెద్ద స్వీడెన్ రాయబారి రోల్ఫ్ సోహోల్మన్ సోవియట్ విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు గొప్ప విజయం సాధించినందుకు సోవియట్ మంత్రివర్గాధ్యక్షుడు యన్. యస్. కృశ్చేవ్‌నూ, సోవియట్ ప్రజలు యావన్మందినీ మనఃపూర్వకంగా అభినందించారు.

యన్. యస్. కృశ్చేవ్ మళ్ళీ మాటాడుతూ, యీ మొదటి రోదసీ యాత్ర యావత్తూ మానవ జాతికీ చెందినదని నొక్కి చెప్పారు.

రోదసీ నౌక ఓస్తోక్ నిర్మాణంలో పాల్గొన్నవారందరికీ ఉన్నతమైన ప్రభుత్వ బహుమానాలివ్వబడతాయని సోవియట్ ప్రభుత్వాధిపతి ప్రకటించాడు. రోదసీ నౌకను సృష్టించిన వారికి ఆయన శుభాన్ని కాంక్షించారు.

ఈ స్వాగత సమావేశంలో జరిగిన ఉపన్యాసాలన్నిటికీ మధ్య మధ్య పెద్ద హర్షధ్వానాలు జరిగాయి.

రోదసిపై సాధింపబడిన యీ నూతన విజయాన్ని సోవియట్ ప్రజలు తమ విజయంగానే కాకుండా, సకల అభ్యుదయకాముక మానవ జాతి విజయంగా పరిగణిస్తారు. అభ్యుదయం, సౌఖ్యం పేరిట, ప్రపంచ ప్రజలందరి శ్రేయస్సుకొరకు యీ విజయాన్ని సోవియట్ ప్రజలు సకల దేశాల సేవకు సంతోషపూర్వకంగా అర్పిస్తారు.

ప్రపంచ ప్రథమ రోదసీ నౌకా చోదకుడు, సోవియట్ వైమానికుడు
మేజర్ వై. ఎ. గగారిన్‌కు సోవియట్ దేశ వీర బిరుద
ప్రదానం గురించి

# సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ నిర్ణయం

మన మాతృభూమికి యశస్సు చేకూర్చిన ప్రథమ రోదసీ యాత్రా వీరోచిత కృత్యానికి; సోవియట్ ప్రజలపట్ల, కమ్యూనిజం ఆశయంపట్ల, సకల మానవాళి ప్రగతి ఆశయంపట్ల ధైర్య సాహసాలు, నిర్భయత్వం, స్వార్థరహిత సేవ ప్రదర్శించినందుకూ, ప్రపంచపు ప్రథమ రోదసీ నౌకా చోదకుడు మేజర్ యూరీ అలెక్సియేవిచ్ గగారిన్‌కు ఆర్డర్ ఆఫ్ లెనిన్, స్వర్ణ తార పతకంతోపాటుగా సోవియట్ దేశ వీర బిరుదాన్ని యివ్వడానికీ; మాస్కో నగరంలో యీ వీరుని అర్ధ కాంస్య విగ్రహాన్ని నెలకొల్పడానికీ నిర్ణయించడమైంది.

క్రెమ్లిన్, మాస్కో
ఏప్రిల్ 14, 1961

యల్. బ్రెజ్నెవ్,
సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ సభాపతి

యం. జియోర్గడ్జె,
సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ కార్యదర్శి

సోవియట్ దేశ రోదసీ నౌకా చోదకుడు అన్న బిరుదును
స్థాపించడం గురించి

# సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ నిర్ణయం

రోదసీ నౌకలో ప్రపంచానికి తొలిసారిగా మానవునితో అంతరిక్ష యాత్ర గౌరవార్థం, సోవియట్ దేశ రోదసీ నౌకా చోదకుడన్న బిరుదాన్ని నెలకొల్పడానికి నిర్ణయించడమైంది.

క్రెమ్లిన్, మాస్కో
ఏప్రిల్ 14, 1961

యల్. బ్రెజ్నెవ్,
సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ సభాపతి

యం. జియోర్గిడ్జె,
సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ కార్యదర్శి

మేజర్ వై. ఎ. గగారిన్‌కు "సోవియట్ దేశ రోదసీ నౌకా చోదకు" డన్న బిరుద ప్రదానం గురించి

# సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ నిర్ణయం

రోదసీ నౌక "వోస్తోక్" పైని ప్రపంచానికి తొలిసారిగా రోదసీ యాత్రను జరిపినందుకు సోవియట్ దేశ పౌరుడు మేజర్ యూరీ అలెక్సీయేవిచ్ గగారిన్‌కు, "సోవియట్ దేశ రోదసీ నౌకా చోదకు"డన్న బిరుదాన్ని యివ్వడానికి నిర్ణయించడమైంది.

క్రెమ్లిన్, మాస్కో
ఏప్రిల్ 14, 1961

యల్. బ్రెజ్నెవ్,
సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ సభాపతి

యం. జియోర్గద్జె,
సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ కార్యదర్శి

# నక్షత్ర లోకానికి అపూర్వ యాత్ర

## విజ్ఞాన శాస్త్రజ్ఞుల సమాజంలో పత్రికా విలేఖరులతో గోష్ఠి

నూతన శకంలో నాలుగోరోజు. ప్రకృతి పెట్టిన అడ్డంకులన్నిటినీ దాటి రోదసిలోనికి మానవుడు ప్రవేశించిన తరవాత నాలుగోరోజు యిది.

మొదటి రోదసీ యాత్ర గురించి విజ్ఞాన శాస్త్రజ్ఞుల సమాజంలో జరిగిన పత్రికా విలేఖరుల గోష్ఠికి వేలాదిమంది సోవియట్, విదేశీ పత్రికా విలేఖరులు, విజ్ఞాన శాస్త్రజ్ఞులు, ప్రముఖులు, దౌత్య ఉద్యోగులు హాజరయ్యారు. వారు తమతో యీ రోజుల్లో వేలాదిమందికిగల కుతూహలాన్ని, తాను చూసిన విషయాలను మొదటి రోదసీ నౌకా చోదకుని నోటి వెంబడినే వినడానికి గొప్ప ఆసక్తిని తీసుకవచ్చా రక్కడికి.

వేలాది కళ్ళు, వందల కొలదీ ఫొటోగ్రాఫిక్, సినిమా, టెలివిజన్ కెమేరాలూ, వేదిక వేపుకు, యూరీ గగారిన్ వేపుకు తిరిగి వున్నాయి. ఆయన విజ్ఞాన శాస్త్రజ్ఞులతో బాటుగా ఆ మందిరం లోనికి వచ్చినప్పుడు, సభాసదులు తమ ఆసనాలపై నుండి లేచి ఆ వీరునికి జయజయధ్వానాలు చేశారు. రోదసిని జయించిన వ్యక్తిపట్ల తమ ప్రశంసా భావాన్ని తెలిపేందుకు ఆయనకు తమ అభివాదా లర్పించడానికి, ఆ విలేఖరుల గోష్ఠి జరిగిన రెండు గంటలలోనూ వారెన్నోసార్లు తమ ఆసనాల నుండి లేచి ఆయనకు జయజయధ్వానాలు చేశారని చెప్పనక్కరలేదుగదా.

సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు అధ్యక్షుడు అకెడిమీషియన్ ఏ. యన్. నెస్మియనోవ్ ప్రారంభించారు.

# అకెడిమీషియన్ నెస్మియనోవ్ ప్రకటన

1961 ఏప్రిల్ 12 న సోవియట్ దేశం, చరిత్రలో తొలి సారిగా మానవునితో కూడిన రోదసీనౌక 'ఓస్తోక్'ను, యూరీ అలెక్సియేవిచ్ గగారిన్ నడిపిన దానిని భూమి చుట్టూరా కక్ష్యలో పెట్టింది.

ఇది ఉదయం పూట జరిగింది. ఈ రోదసీ నౌక, భూతలానికి పైని 175 కిలోమీటర్ల పెరిగీలోనూ, 302 కిలోమీటర్ల అపొగీలోనూ కక్ష్యలో ప్రవేశించింది. అది కక్ష్యలో వున్న కాలం 89.1 నిమిషాలు. రోదసీ నౌకా చోదకుని బరువుతో బాటుగా, యీ వాహనం బరువు 4,725 కిలోగ్రాములు.

రోదసీ నౌకా చోదకుడు సురక్షితంగా ప్రయాణించి తిరిగీ భూమికి రావడానికి అవసరమైన ప్రతి ఒక్కటీ యీ రోదసీ నౌకకు అమరిక చేయబడ్డాయి. ఈ వాహనంలోని పలువ్యవస్థలు జతలుగా వున్నాయి. చోదకుడు కక్ష్యలో తనస్థితిని, ఏ క్షణాన్నయినా కనుగొనడానికి దానిలో పరికరాలున్నాయి.

బయలుదేరడానికి ముందర, యాత్రా సమయంలోనూ చోదకునితో రెండు వేపులా నిరంతరం రేడియో ద్వారా వార్తా ప్రసారం జరిగింది.

యూరీ అలెక్సియేవిచ్ గగారిన్ అపూర్వ ధైర్య స్థైర్యాలు, దీక్ష గురించి నేను నొక్కి చెప్పక తప్పదు. ఈ యాత్రకు ముందరి రాత్రి ఆయన, వైద్యుల సలహా ప్రకారం నిశ్చింతగా నిద్రపోయారు, యాత్రకు చాలా గంటల ముందర మేలుకున్నారు.

సన్నాహ కాలమంతటా, రాకెట్ బయలుదేరాకా ఆయన హృదయ స్పందనం నిమిషానికి 70–75. ఆయన హాస్యంగా మాటాడేరు, తన ఉత్సాహం ద్వారా ఆ యాత్రా విజయంలో నమ్మకాన్ని ఎక్కువ చేశారు.

రాకెట్ మోటార్ల పనిని మొదలు పెట్టడానికి సమయం వచ్చిందని, ఆయన ఉల్లాసంగా "సరే, పోదాం పోదాం పైపైకి!" అని అన్నారు.

ప్రోద్బలం కనిపించే దశలో, బలవత్తరమైన రాకెట్ మోటార్ల



విజ్ఞాన శాస్త్రజ్ఞుల సమాజంలో జరిగిన సమావేశంలో (ఏప్రిల్ 15) యూరీ గగారిన్ ప్రసంగిస్తోన్న దృశ్యం. గగారిన్‌కు ఎడమను సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు అధ్యక్షుడు అకెడెమీషియన్ నెస్మియనోవ్, కుడివేపున అకెడెమీషియన్ కైదారోవ్ వున్నారు.

పని చేస్తోంటే, ఆయనకు పెద్ద బరువుల, స్పందనాల, రొదయొక్క తాకిడి బాగా తగులుతోంటే, యిటువంటి తీవ్ర దశలో కూడా యూరీ అలెక్సేయేవిచ్ గగారిన్ తన పరిస్థితి గురించీ, రోదసీ నౌక కోశంలోని వ్యవస్థల పని గురించీ అవసరమైన భోగట్టాసంతట్నీ ఆపకుండా తెలియజేస్తూనే వున్నారు. వాతావరణం దట్టమైన పొరలనుంచి తాను బయటపడి, భూమిని చూసినప్పుడు "ఎంత చక్కని దృశ్యం!" అని ఆయన అన్నాడు.

తరవాత యాత్రా సమయం అంతట్లో గగారిన్, భూమితో నిరంతర సంబంధం సాగించారు. 9.52కు దక్షిణ అమెరికా మీదుగా పోతూ ఆయన "యాత్ర మామూలుగా సాగిపోతూన్నది. బాగున్నాను నేను" అని తెలియ



విజ్ఞాన శాస్త్రజ్ఞుల సభాభవనంలో, 1961 ఏప్రిల్ 15న గగారిన్ పత్రికా విలేఖరుల సమావేశంలో వున్న సోవియట్, విదేశ పత్రికా విలేఖరులు.

జేశారు. 10.15 కు ఆఫ్రికా మీదుగా పోతూ గగారిన్ "భార రాహిత్యాన్ని బాగా తట్టుకుంటున్నాను" అని తెలియజేశాడు.

ఈ రోదసీ నౌక రెట్రో—రాకెట్లు 10.25 కు నడపబడ్డాయి. ఈ వాహనము, దాని చోదకుడు మేజర్ గగారిన్‌తోబాటుగా కక్ష్యలో నుండి నిర్దిష్ట స్థలంలో దిగడం మొదలయ్యింది. 10.55 కు సోవియట్ రోదసీ నౌక ఓస్తోక్ సురక్షితంగా భూమికి దిగింది.

ఈ విధంగా సాటిలేని కార్యం సాధింపబడింది. మానవ నాగరికతా చరిత్రలో ఉజ్జ్వలమైన ఒక కొత్త పుట లిఖింపబడింది. మన కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వం నాయకత్వాన సోవియట్ ప్రజలు చేసిన మహత్తర కార్యం యిది. సామూహికంగా విజ్ఞాన శాస్త్రజ్ఞులు, డిజైనర్లు, ఇంజినీర్లు, సాంకేతిక నిపుణులు, కార్మికులు సాధించిన మహత్తర కార్యం ఇది. రోదసీ నౌక యాత్రకు సన్నాహాలనూ, దానిని పైకి పంపడాన్నీ జయప్రదం చేసిన ప్రాయోగిక ఉద్యోగులు సాధించిన మహత్తర కార్యం యిది. ఈ వాహనం సురక్షితంగా ప్రయాణించి భూమికి తిరిగి రావడానికి జయప్రదంగా కృషి చేసిన సేనా శాఖలన్నీ సాధించిన మహత్తర కార్యం యిది. సోవియట్ భూమి వీర పుత్రుడు యూరీ అలెక్సియేవిచ్ సాధించిన మహత్తర కార్యం యిది. ఆయన పేరు యిప్పటికే గాథ అయిపోయింది.

ఈ మహత్తర కార్యంలోని ప్రతి ఒక్కటీ ప్రముఖమైన అంశమే : మొదటి రోదసీ యాత్రీకుడు సోవియట్ పౌరుడన్న విషయం, యూరీ గగారిన్ వెళ్ళిన మొదటి రోదసీ నౌక పేరు "ఓస్తోక్" (తూర్పు) అన్న విషయమూ, యీ యాత్ర ప్రభాత కాలంలో జరిగిందన్న విషయమూ. ఈ ప్రభాతం, నవశకానికి ప్రభాతమయ్యింది.

ఇప్పట్నుండి ఎల్లప్పుడూ 1961 ఏప్రిల్‌లో 12వ రోజు, యూరీ గగారిన్ జరిపిన మహత్తర కార్యంతో ముడిపడి వుంటుంది. ఈ భూప్రదక్షిణ యాత్ర 108 నిముషాలు జరిగింది. ప్రపంచాన్ని కదల్చివేసిన నిముషాలివి.

మానవ నాగరికతకు సుదీర్ఘమైన, పరమాద్భుతమైన చరిత్ర వుంది.

దానిలో జరిగిన ప్రతిఒక్క ఘన కార్యమూ. తొలిసారిగా లిపిని సృష్టి చేయడంగానీ, తొలిసారిగా ఆవిరి యంత్రాలను సృష్టి చేయడంగాని, తొలి సారిగా భూగోళానికి ప్రదక్షిణ చేయడంగాని—యివ్వన్నీ మానవుడు పైమెట్టు కెక్కడానికి సూచించే ఘట్టాలు; ప్రగతి శక్తినీ, సృష్టి శక్తినీ నొక్కి చెప్పే ఘట్టాలు. వెంటనే యీ మహత్తర కార్యాల ప్రాముఖ్యం గుర్తింపబడలేదు. పాత బుద్ధులు కొత్తవాటిని తీవ్రంగా ప్రతిఘటించాయి. భవిష్యత్తు పైని వెలుగులు వెదజల్లే ఘటన ఎంత విప్లవకరమైనదైతే, పాత వ్యవస్థ నుండి వచ్చే ప్రతిఘటన అంత భయంకరంగా వుండేది.

ఇరవైయ్యో శతాబ్ది ప్రారంభాన, తన ప్రతిభకు గుర్తింపురాని త్సియొల్కోవ్స్కి మానవ జాతికి నక్షత్ర లోకానికి దారి చూపారు. ఆయన రచనలలో రోదసీయాన మూల శాస్త్రీయ సూత్రాలు న్నాయి. ఈ విజ్ఞాన ఉజ్జ్వల విజయానికే మన మీనాడు ఉత్సవం జరుపుకుంటున్నాము.

త్సియొల్కోవ్స్కి "భూమి మానవ యోచనకు ఉయ్యాల, అయితే మనం ఎల్లప్పుడూ యీ ఉయ్యాలలోనే వుండి పోలేముగదా" అన్న మాటలు నిజమయ్యాయి.

యూరీ గగారిన్, తొలి రోదసీ యాత్రీకుడు చాలా కష్టమైన పెద్ద శిక్షణను పొందారు. ఇది ఎంతో అసాధారణమైన ప్రగాఢమైన వైజ్ఞానిక శిక్షణా పద్ధతి. ఇది యీ రోదసీ యాత్రీకునికి రోదసీ నౌకయొక్క డిజైనుకు సంబంధించిన అవసరమైన సాంకేతిక జ్ఞానాన్నీ; ఖగోళ, భూపదార్థ విజ్ఞాన, జీవశాస్త్రాది శాస్త్రాల జ్ఞానాన్నీ చేకూర్చింది.

రోదసీ నౌకా చోదకుడు ప్రత్యేకమైన సెంట్రిఫ్యూగల్ యంత్రాల, పరిస్పందన స్థావరాలలో గొప్ప ఒత్తిడికి గురిచేయబడ్డారు. రోదసీ నౌకా కోశానికి సరిగ్గా నమూనాగా వున్న గాలి చొరని కోశాలలో ప్రయోగాలు రోజులు, వారాల తరబడిని జరిగాయి. భూమికి దిగే పద్ధతి నిర్దుష్టం చేయబడింది.

ఈ బ్రహ్మాండమైన కృషి యావత్తూ చరిత్రలో తొలి రోదసీ యాత్రగా ఫలించింది.

ప్రియమైన యూరీ అలెక్సియేవిచ్,

సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు అధ్యక్షవర్గం పక్షాన నేను అద్భుత సోవియట్ పౌరులైన, రోదసికి కొలంబస్ అయిన మిమ్మలను కీర్తిస్తున్నాను (దీర్ఘ హర్షధ్వానాలు. సభాసదులందరూ నిలుచుండి గగారిన్‌కు జయ జయ ధ్వానాలు చేశారు).

శతాబ్దాలు గడుస్తాయి. కాని మీ పేరు, రోదసిలో తొలి మానవ యాత్రను; సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, డిజైనర్లూ, వ్యక్తిగతంగా మీరూ చేసిన మహత్కార్యాన్ని సర్వదా స్మరణకు తీసుక వస్తుంది (హర్ష ధ్వనులు).

మానవ సేవకొరకు మీరు ధైర్య సాహస పరాక్రమాలకు దృష్టాంతాన్ని చూపారు సర్వ మానవాళికీ !

రోదసీ నౌక 'వొస్తోక్'లో ప్రపంచానికి తొలిసారిగా రోదసీయాత్రను జరిపినందుకు సోవియట్ విజ్ఞానశాస్త్ర పరిషత్తు అధ్యక్షవర్గం యీ వీరునికి బహూకరించిన త్సియొల్కోవ్‌స్కీ స్వర్ణపతకాన్ని అకడమీషియన్ ఏ. యన్. నెస్మియనోవ్, వై. ఏ. గగారిన్‌కు బహూకరించారు.

ప్రపంచ ప్రజల జీవితంలో చరిత్రాత్మక ఘటన అయిన తొలి మానవ రోదసీ యాత్రకు సంబంధించిన పత్రికా విలేఖరుల గోష్ఠిని ప్రారంభించాక అకెడమీషియన్ నెస్మియనోవ్, సోవియట్ దేశ వీరుడు యూరీ అలెక్సి యేవిచ్ గగారిన్‌ను ప్రసంగించవలసిందిగా కోరారు.

# వై. ఏ. గగారిన్ ప్రకటన

ప్రియమైన కామ్రేడ్స్, గౌరవనీయులైన అతిథులారా,

నా జీవిత చరిత్రను తెలుసుకోవాలని చాలామంది కుతూహల పడుతున్నారు. నేను గగారిన్ రాకుమారుని వంశానికి చెందిన వాణ్ణని అనుకుంటున్న ఊసు పోని వారు అమెరికాలో కొందరున్నారు; నేను

వారికి ఆశాభంగం కలిగించక తప్పదు. ఇది వారి తెలివి తక్కువ మాత్రమే కాదని అనుకుంటున్నాను. నేను సామాన్య సోవియట్ వ్యక్తిని. ఒక సమష్టి రైతు కుటుంబంలో 1934 మార్చి 9న పుట్టాను. నా జన్మ స్థలం స్మోలెన్‌స్క్ మండలంలో వుంది. మా వంశ వృక్షం మీద రాకుమారు లెవరూ లేరు. నా తలిదండ్రులు విప్లవానికి పూర్వం పేద రైతులు. నా కుటుంబంలో పూర్వీకు లందరూ, మా తాత నాయనమ్మ కూడా పేద రైతులే. ఎన్నడూ మా కుటుంబంలో రాకుమారులే లేరు. (హర్షధ్వనులు). అంచేత అమెరికాలో నా బంధువులని చెప్పుకునేవారికి నేను ఆశాభంగం కలిగించక తప్పదు. (నవ్వు, హర్షధ్వనులు).

నేను పాఠశాలలో చదివాను, తరవాత మాస్కో మండలంలోని ల్యుబెర్ట్సీలో ఒక వృత్తి పాఠశాలలో చదివాను. తరవాత సారతోవ్ లోని ఫౌండ్రీ సాంకేతిక పాఠశాలలో ప్రవేశించాను. అయితే వైమానికుణ్ణి కావాలని నేను చిరకాలంగా కలగంటూ వుండేవాణ్ణి. సాంకేతిక పాఠశాల చదువును నేను 1955లో పూర్తి చేసినప్పుడే సారతోవ్ విమాన యాన సమాజంలో శిక్షణను కూడా పూర్తి చేసుకున్నాను. ఆ తరవాత ఓరెన్‌బర్గ్ విమానసేన పాఠశాలలో నన్ను స్వీకరించారు. 1957లో దీనిలో చదువును నేను ఫైటర్ విమాన చోదకుని అర్హతతో పూర్తి చేసుకున్నాను. సోవియట్ సాయుధ సేనల ఒక దళంలో పని చేశాను.

నా తక్షణ కోర్కె ననుసరించి, సోవియట్ రోదసీ కార్యక్రమానికి ఒక అభ్యర్థిగా నేను స్వీకరింపబడ్డాను. పరీక్షల్లో నెగ్గి, రోదసీ వైమానికుణ్ణయ్యానని మీరు ఎరుగుదురు (హర్షధ్వనులు). మా విజ్ఞాన శాస్త్రజ్ఞులు తయారు చేసిన కార్యక్రమాన్ననుసరించి శిక్షణను పొందాను. విజ్ఞాన శాస్త్ర పరిషత్తు అధ్యక్షుడు సవివరంగా దీనిని వర్ణించారు. శిక్షణ జయప్రదమయ్యింది. నేను యంత్రాలనూ, సామగ్రినీ బాగా అవగతం చేసుకున్నాను, రోదసీ యాత్రకు సిద్ధమయ్యాను.

ఈ యాత్రను నాకు అప్పగించినందుకు నేను యెంతో ఆనందిస్తున్నాను; మా పార్టీకీ, ప్రభుత్వానికీ నేనెంతో కృతజ్ఞుణ్ణి. మా దేశం

పేరిట, వీర సోవియట్ ప్రజల పేరిట సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ పేరిట, దాని లెనినిస్టు కేంద్ర కమిటీ పేరిట దానిని నేను నిర్వహించాను. (హర్షధ్వానాలు).

ఈ యాత్రకు ముందర నేను చాలా కులాసాగా వున్నాను. అది జయప్రదమవుతుందని నా పూర్తి విశ్వాసం. మా యంత్రాలూ, సామగ్రి చాలా నిలకడ అయినవి, నేనూ, నా కామ్రేడ్స్, విజ్ఞాన శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లూ, సాంకేతిక నిపుణులూ యీ బాధ్యత విజయాన్ని యెన్నడూ సందేహించలేదు.

యాత్రా సమయంలో కూడా నేను కులాసాగా ఉన్నాను.

అదనపు బరువులను పంపడానికి నౌకను పైకి త్రోసే దశలో, ప్రకంపనం, రొద, ఇదితర రోదసీ యానానికి సంబంధించిన హంగామా నన్ను యిబ్బంది పెట్టలేదు. యాత్రా కార్యక్రమాన్ననుసరించి నేను ఫల ప్రదంగా పని చేయగలిగాను.

కక్ష్యలో ప్రవేశించాక, వాహక రాకెట్ వేరుపడినప్పుడు, భార రాహిత్యం వచ్చింది. మొదట యీ అనుభవం అసాధారణ మనిపించింది, ఇంతకు పూర్వం నేను సున్నా—గురుత్వానికి కాస్త కాస్త గురి చెయ్య బడినప్పటికీ, నేను తొందరగానే యీ వింత స్థితికి అలవాటు పడి పోయాను, దానికి సర్దుబాటు చేసుకున్నాను, కార్యక్రమాన్ని సాగించాను. నా స్వీయాభిప్రాయంలో శరీరపు పని సామర్థ్యం పైని భారరాహిత్యం పని చెయ్యదు, శారీరక క్రమాల పైనీ యిది పని చెయ్యదు.

యాత్రా సమయం అంతట్లో, నిర్ణీత కార్యక్రమాన్ననుసరించి నేను ఫలప్రదంగా పనిచెయ్య గలిగాను. నేను ఆహారం తీసుకున్నాను, పానం చేశాను. పలు మార్గాల ద్వారా, రేడియో-టెలిఫోన్, టెలిగ్రాఫ్ రెండింటి ద్వారా నేను నిరంతరం భూమితో రేడియో కమ్యూనికేషన్ జరిపాను; పరిసరాలను పరిశీలించాను, రోదసీ నౌక సామగ్రి పనిని చూశాను, భూమికి సమాచారం పంపాను, నా పరిశీలనను ఇదితర సమాచారాన్నీ వ్రాశాను, మాగ్నెటిక్ టేప్‌మీద రికార్డు చేశాను. భారరాహిత్య దశ అంతట్లో నేను చాలా కులాసాగా వున్నాను., మామూలుగా పనిచేశాను. ఆ తరవాత

యాత్రా కార్యక్రమాన్ననుసరించి క్రిందికి దిగమని ఆజ్ఞ జారీ చేయబడింది. రోదసిలో యీ వాహనం ఉచితరీతిని నడపబడింది, దాని బ్రేకింగ్ సిస్టం పని చేయించబడింది, దాని వేగం పడిపోయింది. నేను భూమికి వచ్చి, మా సోవియట్ ప్రజలను కలుసుకొని ఆనందించాను. నిర్ణీత స్థలంలో భూమికి దిగడం జరిగింది.

నేను చూసిన దానిని చెప్తాను.

175-300 కిలోమీటర్ల ఎత్తునుండి భూమిని చక్కగా చూడవచ్చును. జెట్ విమానాల్లో పెద్ద ఎత్తులలో ఎగురుతున్నప్పుడు మనకు కనిపించినట్టుగా వుంటుంది భూతలం. పెద్ద పర్వత శ్రేణులనూ, పెద్ద నదులనూ, పెద్ద అడవులనూ, తీరాలనూ, దీవులనూ స్పష్టంగా చూడవచ్చును. భూమిని కప్పే మబ్బులనూ, వాటి నీడలనూ చాలా బాగా చూడవచ్చును. ఆకాశం కారునలుపుగా వుంది. ఈ పరిసరాల్లో చుక్కలు ఎక్కువ తేజోవంతంగా, ఎక్కువ స్పష్టంగా కనిపిస్తాయి. భూమిని నీలిమ కప్పివుంది. క్షితిజం వేపున దీనిని చాలా బాగా గమనించవచ్చును. ఆకాశపు రంగు చాలా క్రమక్రమంగా, అందంగా లేత నీలం నుండి, అల్ట్రా మారీనీ, గాఢనీలం, ఊదా రంగుల ద్వారా, చివరికి సిరానలుపుకు మారుతుంది.

నీడనుండి వెలువడ్డాక సూర్యుడు భూమి వాతావరణంలో ప్రకాశించాడు. తేజోమండలం కొంతవరకూ వేరు రంగుగా వుంది. సరిగ్గా క్షితిజంమీదనే, ఉపరిభాగానికి సమీపంగా, అది తళతళలాడే నారింజ రంగులో వుంది. తరవాత ఇంద్ర ధనుస్సులోని రంగులన్నిట్లోకీ మారి అల్ట్రా మారీన్ గానూ, నీలంగానూ, ఊదా రంగుగానూ, నలుపుగానూ అయ్యింది.

భూమి నీడలోనికి ప్రవేశం చాలా త్వరగా జరుగుతుంది. అది వెంటనే అంధకారమైపోయి, ఏదీ కనిపించదు. అప్పుడు బహుశా ఆ వాహనం సముద్రం మీదుగా వెళ్తూ వుండవచ్చును. అది పెద్ద నగరాల మీదుగా వెళ్తున్నట్టయితే, వాటి దీపాలను నేను చూసివుండేవాణ్ని. నక్షత్రాలు చాలా తేజస్సుతో ప్రకాశించాయి.

భూమి నీడనుండి బయట పడడం కూడా తొందరగా, హటాత్తుగా జరిగింది.

నేను ప్రత్యేక శిక్షణ పొంది వుండడంవల్ల, రోదసీ యాత్ర ఫలితాలను బాగా భరించాను. ప్రస్తుతం నేను కుశాలాగా వున్నాను.

ఆ అద్భుతమైన 'ఓస్తోక్' రోదసీ నౌకనూ, దాని అద్భుతమైన సామగ్రినీ, అటువంటి పెద్ద నౌకను కక్ష్యలో ప్రవేశపెట్టిన దాని శక్తివంతమైన వాహక రాకెట్‌నూ సృష్టించిన మా సోవియట్ డిజైనర్లకూ, ఇంజనీర్లకూ, సాంకేతిక నిపుణులకూ, సోవియట్ శ్రామిక ప్రజలందరికీ నేనెంతో కృతజ్ఞుణ్ని.

నా ప్రియమైన మాతృభూమి మానవ చరిత్రలో తొలిసారిగా రోదసిలోనికి ప్రవేశించినందుకు నేను అపారంగా ఆనందిస్తున్నాను. మొదటి విమానం, మొదటి స్పూత్నిక్, మొదటి రోదసీ నౌక, మానవునితో తొలిసారిగా రోదసీ యాత్ర యివ్వన్నీ ప్రకృతి వైపరీత్యాలపైని ఆధిపత్యానికి, మా దేశపు మహత్తర పురోగమనంలో యివ్వన్నీ మైలురాళ్లు. లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీ యీ లక్ష్యం వేపుకు మా ప్రజలను ధైర్యంగా నడిపిస్తోంది (హర్షధ్వనులు).

నా జీవితంలోనూ, కృషిలోనూ, వృత్తి పాఠశాలలోనూ, పారిశ్రామిక సాంకేతిక పాఠశాలలోనూ, విమానయాన సమాజంలోనూ, విమానసేన పాఠశాలలోనూ, అడుగడుగునా నేను సభ్యుణ్నిగా వున్న పార్టీ ప్రేమాదరాలను పొందుతూ వున్నాను. సోవియట్ దేశంలో సామాన్య ప్రజల పట్ల కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ, మన ప్రియమైన నికితా సెర్గియేవిచ్ క్రుశ్చేవ్ ప్రేమపూర్వకమైన మానవాభిమానాన్ని నేను ప్రత్యేకంగా పేర్కొనదలుచుకున్నాను. (హర్షధ్వనులు). మా సోవియట్ భూమిపైని దిగిన కొద్ది నిమిషాలకే నికితా క్రుశ్చేవ్ నుండి నాకు హృదయపూర్వకమైన అభినందనలను తెలుపుతూ టెలిగ్రాము వచ్చింది; రోదసీ యాత్ర జయప్రదంగా పూర్తి అయినందుకు ఆయన నాకు అభినందనలు పంపారు. వీర సోవియట్ ప్రజలకూ, మా

ప్రభుత్వానికీ, మా కమ్యూనిస్టు పార్టీకి, దాని 22వ మహాసభకూ మా యాత్రను అంకితం చేశాము.

రోదసిపైని నిజమైన విజయంకొరకు, మేము తరచు రోదసీ యాత్ర చేయాలని ఆశిస్తున్నాము (హర్షధ్వానాలు). విజ్ఞాన శాస్త్రాభివృద్ధిలో యితర దేశాలు సాధించే విజయాలను మేము ఎప్పుడూ హర్షిస్తాము. రోదసిలో యితర దేశాల రోదసీ నౌకా చోదకులకు మేము సంతోషపూర్వకంగా స్వాగతం చెప్తాము; శాంతియుతంగా రోదసిని అన్వేషించడంలో వారికి విజయాన్ని ఆకాంక్షిస్తాము. రోదసిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించడంలో వారితో సహకరించడానికి మేము అభిలషిస్తున్నాము (హర్షధ్వానాలు).

రోదసిలో యెక్కువగా ప్రయాణించాలని వుంది వ్యక్తిగతంగా నాకు, నాకదే యిష్టం (హర్షధ్వానాలు). నాకు శుక్ర, అంగారక గ్రహాలకు వెళ్ళాలనుంది, మంచి యాత్రలు చేయాలనుంది (హర్షధ్వనులు).

# యస్. యం. సిసక్యాన్ ప్రకటన

రోదసిని అన్వేషించడానికీ, జయించడానికీ మానవుడు సర్వదా ప్రయత్నిస్తున్నాడు. దీనివల్ల జానపద గాధలూ పుట్టాయి, కమ్మని కలలు వచ్చాయి. ఒక గ్రీకు కథ వుంది. దయెడలుస్ కొడుకు ఇకరస్ మైనంతో అతుకు పెట్టబడిన రెక్కలతో ఎలా గాలిలోనికి ఎగిరాడో చెపుతుందా కథ. అతను సూర్యుడికి చాలా దగ్గరగా ఎగిరాడు. మైనంతో అతుకుపెట్టిన చోట్లు కరిగిపోయి, అతను భూమిమీద పడిపోయాడు. మానవుని సృజనాత్మకమైన మనస్సును యిటువంటి పెద్ద కలలు కలవర పెడుతూనే వున్నాయి; అవి విశ్వ విజయానికి నూతన మార్గాల అన్వేషణకు మూలంగా వుంటూనే వున్నాయి.

బెలూన్లు, విమానాలు, రాకెట్లు, కృత్రిమ భూ ఉపగ్రహాలూ ఆకాశ

ములోకి ఎగిరాయి. అన్నిటికంటె దృఢమైన మిశ్రమ లోహంచే—విజ్ఞాన శాస్త్ర సూత్రాలచే అతుకు పెటబడిన రెక్కలను సంపాదించాడు మానవుడు. మానవుడు దృఢంగా భూమిమీద వుండడానికే కాకుండా, రోదసికి బాటను వెయ్యడానికి కూడా యివి తోడ్పడ్డాయి.

చరిత్రాత్మక ప్రాముఖ్యం గల ఒక ఘటనను, రోదసిలో మానవుని తొలి యాత్రను నేడు మనం గణుతిస్తున్నాము. ఈ సందర్భాన, రోదసీ యాత్రీకుని ఎంపిక, శిక్షణకు సంబంధించిన పద్ధతులను ప్రత్యేకంగా పేర్కొనవలసి వుంటుంది.

రోదసీ నౌకాయానం, చరిత్రలోనికి మొదటిసారిగా వచ్చిన కొత్త వృత్తి. సోవియట్ రోదసీ యాత్రీకునిలో అలెగ్జాందర్ మత్రొసోవ్ ధైర్యం, గ్యాస్టెలో పరాక్రమం, జోయా కోస్మదెమ్యన్స్కయా స్థైర్యం వుంటాయి; లెనిన్ యొక్క మహత్తర పార్టీ నిర్మించిన వ్యక్తికుండే దృఢ దీక్ష వుంటుంది.

సోవియట్ జీవిత పరిస్థితులలో పెరిగిన రోదసీ నౌకా చోదకుడు యిటువంటి వ్యక్తి. విజ్ఞాన శాస్త్రం అతనికి అవసరమైన జ్ఞానాన్ని చేకూర్చింది, రోదసీ యానంలోని కష్టాన్ని ఓర్చుకునే శక్తి నిచ్చింది. రోదసీ యాత్రకు శారీరకంగా యోగ్యులైనవారి ఎంపిక, శాస్త్రీయమైన ప్రత్యేక సన్నాహాలూ, వారిని సుశిక్షితులుగా చేయడమూ—యివ్వన్నీ కొత్త సమస్యలు. వాటిని పరిష్కరించడంలో విజ్ఞాన శాస్త్ర వేత్తలు రోదసీ యానపు ప్రత్యేక విషయాలపైని, పూర్వపు పలు జీవశాస్త్ర ప్రయోగాల ఫలితాలపైని, రోదసీ నౌకా కోశంలో మనిషివుంటి పనిచేసే పరిస్థితుల జ్ఞానంపైని, యాత్రా సమయంలో రోదసీ నౌకా చోదకుని వర్తన గురించి ఊహపైనీ ఆధారపడి పనిచేశారు. రోదసీ నౌకా చోదకునిగా పూర్తి ఆరోగ్యవంతుని మాత్రమే సహజంగా చేస్తారు. అతను ఉన్నతమైన మేధాశక్తి, సాంకేతిక జ్ఞానం, దృఢదీక్ష కలిగినవాడై వుండాలి. అతను చప్పున, అటువంటి తీవ్ర పరిస్థితిలో మంచి హేతు బద్ధమైన నిర్ణయాలు తీసుకోగలిగినవాడై వుండాలి,

వాటిని వెంటనే అసలు జరపగలిగి వుండాలి, పరిస్థితిని తొందరగా తప్పు లేకుండా అంచనా వేయగలగాలి.

ఎంపిక కార్యక్రమంలో, భావి రోదసీ నౌకా చోదకుని ఒక వైద్య శాలలో సంపూర్ణంగా పరీక్ష చేయడం వుంటుంది. ఇంతే కాదు. మానవావయవాల పనిని, విరుద్ధమైన పరిసరాలకు అవి అలవాటు పడడాన్ని పూర్తిగా తెలుసుకోడానికి అవకాశం కలిగించిన ప్రత్యేకమైన అన్వేషణా పద్ధతులు కూడా ఉపయోగించబడ్డాయి. ప్రయోగాలు సెంట్రీ-ఫ్యూజెస్ పైనీ, ప్రకంపన ప్రయోగ వేదికలపైనీ, ఉష్ణ మందిరాలలోనూ, గాలి తక్కువగా వుండే మందిరాలలోనూ, ఏకాకిగా చాలాసేపు వుండే పరిస్థితులలోనూ, బాహిరమైన ప్రోద్బలాలు (ఉదాహరణకు శబ్దం, వెలుగు మొదలైనవి) పూర్తిగా లేని నిశ్శబ్ద మందిరాలలోనూ చేయబడ్డాయి.

ఎంపిక కార్యక్రమంలో మానసిక సంబంధమైన అన్వేషణలకు ప్రత్యేకమైన ప్రాముఖ్యం యివ్వబడింది. భావి రోదసీ యాత్రీకుని తుది ఎన్నిక చేయడానికి, సన్నాహక, శిక్షణ దశలో యింకా సమగ్రమైన అన్వేషణలు జరుపబడ్డాయి. రోదసీ యాత్రలో చేయవలసిన పనులకు సంబంధించిన సిద్ధాంత అంశాల బోధన; కోశంలోని సామగ్రిని, వైజ్ఞానిక పరికరాలను ఉపయోగించడానికి అవసరమైన నిపుణతల శిక్షణ సన్నాహ దశలో యివ్వబడతాయి.

ప్రతి ఒక్క రోదసీ నౌకా చోదకుడూ రాకెట్ డైనమిక్స్, రోదసీ పదార్థ విజ్ఞాన శాస్త్రం, మానవ శరీరంపైన రోదసీ యాత్రా ఫలితాలకు సంబంధించిన అనేక ప్రత్యేక అంశాల గురించి మంచి పరిజ్ఞానాన్ని సంపాదించారు. రోదసీ యాత్రకు ముందరి శిక్షణలో, సహజంగా అతని శరీర దార్ఢ్యం చాలా ముఖ్యాంశం.

శారీరక శిక్షణ ప్రయోజనకరంగా యివ్వబడింది. మామూలు శరీర వ్యాయామంలోని పద్ధతులు, సౌకర్యాలూ ఉపయోగింపబడ్డాయి, రోదసీ యాత్రికునికి అవసరమైన శరీర గుణాలను దిట్టపర్చేందుకు. దీని ముఖ్యోద్దేశం వేగానికి అతని ప్రతిఘటనను పెంచడమూ, శారీరక నియంత్రణను,

చక్కని సమన్వయ గమనాలను తయారుచేసి దిట్టపర్చడమూ. అతని ప్రవీణత ఏమాత్రం తగ్గకుండా అదేపనిగా వుండే శారీరక శ్రమను తట్టుకోడానికి అతని సామర్థ్యాన్ని వృద్ధి చేయడానికీ, అతని దీక్షను పెంపొందించడానికీ చర్యలు తీసుకోబడ్డాయి.

ఇంతేకాకుండా ప్రత్యేకమైన వ్యాయామాల గురించి ఎంతో శ్రద్ధ తీసుకోబడింది. దీని ముఖ్యోద్దేశం, రోదసీ నౌకా చోదకుడు రోదసీ యాత్రా సమయంలో సంభవమయ్యే పరిస్థితులకు తట్టుకునేటట్టు చేయడం. ఇంకో మాటలలో చెప్పాలంటే భూమిపైనున్న పరిశోధనాలయంలోనూ, విమానం పైనీ సాధ్యమైనంతవరకూ రోదసీ యాత్ర పరిస్థితులు కల్పించబడతాయి.

శిక్షణలో యీ భాగం, బహుశా అత్యంత ముఖ్యమైనది, అత్యంత కష్టమైనది.

ఈ విధంగా రోదసీ నౌకా చోదకుని శిక్షణయే ఒక వైజ్ఞానిక సమస్య. అయితే ఎంత క్లిష్టమైనదైనా, ఎంత అసాధారణ కష్టంలో కూడివున్నదయి నప్పటికీ, జయప్రదంగా యిది నెరవేర్చబడిందని మనం ఎరుగుదుము.

ప్రపంచానికి ప్రథమ రోదసీ నౌకా చోదకుడు, సాటిలేని మహత్కార్యాన్ని, ప్రపంచ చారిత్రాత్మక ప్రాముఖ్యం గల మహత్కార్యాన్ని సాధించిన మా ప్రియమైన దేశీయుడు యూరీ అలెక్సియేవిచ్ గగారిన్‌ను మహదానందంతోనూ, గర్వ భావంతోనూ మేము అభినందిస్తున్నాము.

ఈ మహత్కార్యానికి బాట వేసినవి మా విజ్ఞాన శాస్త్రజ్ఞుల, ఫాక్టరీ కార్మికుల, ఇంజనీర్ల, సాంకేతిక నిపుణుల సమిష్టి కృషి, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన మా ప్రజల స్వార్థరహిత కృషి.

రోదసీ యాత్రకు బాటపైని వెలుగు పడింది. బ్రహ్మాండమైన కృషి జరిగింది, మహత్తర విజయం సాధింపబడింది. మా విజ్ఞాన శాస్త్రానికి నూతనమైన విశాలమైన నదవకాశాలు అందుబాటులోనికి వచ్చాయి. మానవుడు రోదసిలో ప్రవేశించడం మాత్రమేకాదు, అక్కడ తాను స్థిరపడాలి, విశ్వాన్ని తన అదుపులో పెట్టుకోవాలి కూడా.

# ఎ. వి. పరిన్ ప్రకటన

ప్రథమ మానవ రోదసీ యాత్రకు సన్నాహాలకు చాలామంది వైద్య ప్రవీణులు, శరీర శాస్త్రజ్ఞులు, జీవ శాస్త్రజ్ఞులు, మానసిక శాస్త్రజ్ఞులు ఎక్కువ సృజనాత్మక కృషిని చేయడం అవసర మయ్యింది.

మొదటి మానవుడు రోదసిలోనికి వెళ్ళడానికి ముందర చాలా పెద్దగా కృషి జరిగింది. కుక్కలు, చిన్న జంతువులు మొదలైనవాటిలో మొదటి సోవియట్ స్పూత్నిక్‌లు పంపబడినప్పుడు జరిగిం దిది. ప్రాణులపైని రోదసీ యాత్ర ఫలితాల గురించి యీ ప్రయోగాలు ఎంతో ముఖ్యమైన సమాచారాన్నిచ్చాయి, వైజ్ఞానిక వైద్య పరిశీలనా పద్ధతిని రూపొందించు కోవడానికి యివి అవకాశం కలిగించాయి. ఈ అన్వేషణలు శారీరక విధులను పరిశీలించేందుకూ, నమోదు చేసేందుకూ; ముఖ్యంగా రోదసీ యాత్రా సమయంలోనూ, రోదసీ నౌకను తిరిగి రప్పించడం విషయంలోనూ సురక్షితమైన పద్ధతులను ఏర్పర్చుకునేందుకూ చాలా నికరమైన గట్టి విధానాలను ఎంచుకోవడానికి మాకు అవకాశం కలిగించాయి.

పరిసరాలవల్ల మానసికంగా వచ్చే ముఖ్యమైన మార్పులను, శరీరపు పనిలో జరిగే ప్రక్రియలనూ స్వయంచోదకంగానూ, నిరంతరంగానూ పర్యవేక్షించేందుకు విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఒక ప్రత్యేకమైన సామగ్రిని ఏర్పరిచారు. పూర్వపు రోదసీ యాత్రలలో స్పూత్నిక్—రోదసీ నౌకలపైని యీ సామగ్రి జయప్రదంగా ఉపయోగింపబడిందని విదితమే.

ఈ విధంగా భావి మానవ రోదసీ యాత్రకు వైద్య, జీవశాస్త్ర రీత్యా బాట వెయ్యబడింది.

అయినప్పటికీ రోదసీ నౌకా చోదకుని సిద్ధపర్చిన బృందం పని చాలా కష్టమైనది. గతంలో యిటువంటివి ఎన్నడూ జరగలేదు. క్లిష్టమైనా రోదసీ నౌకా చోదకుని అద్భుతమైన సృజనాత్మక కృషి దీనిని చాలావరకూ సుకరం చేసింది. ఆయన నిజమైన పరిశోధకుడయ్యారు, చాలామంది వైజ్ఞానికోద్యోగుల సమిష్టి కృషిలో ఆయనకూడా పాలు పుచ్చుకున్నారు. మానవుని పరి

స్థితి గురించి శాస్త్రీయ పద్ధతిలో పర్యవేక్షణ విధానాలను ఏర్పర్చుకోవడం, ప్రత్యేకమైన కర్తవ్యం. శారీరక విధులను, ప్రత్యేకంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, రక్త ప్రసారాలను బయలు దేరడానికి ముందరా యాత్రా సమయం లోనూ కూడా, పర్యవేక్షించడానికి విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఒక సమన్వయ విధానాన్ని ఏర్పర్చడంలో కృతకృత్యు లయ్యారు.

రోదసీ యాత్రికుని, రోదసీ నౌక బయలుదేరడానికి ముందర శిక్షణ నిచ్చే సమస్య, ఒక ప్రత్యేక తరగతికి చెందిన సమస్య. అధికమైన వైద్య పరిశీలన, ప్రత్యేకాహారం, యాత్ర కుద్దేశించబడిన పద్ధతులద్వారా భూమి పైనున్న పరిశోధన శాలలలో క్రమబద్ధమైన అన్వేషణ—యివ్వన్నీ ఎంతో విలువైన వైజ్ఞానిక సమాచారాన్ని సేకరించడానికి ఒక సమన్వయాన్నీ, వరుస క్రమాన్నీ కల్పించాయి. ఇంతేకాకుండా యివి యాత్రా సమయంలో మానవ శరీరంపై వచ్చే ప్రక్రియలకు సహజమైన విషయాలను మరింతగా విశ్లేషించేందుకు అవసరమైన విశేషాలను మేము గ్రహించేందుకు అవకాశం కలిగించాయి.

మెదడు, కండరాలు పనిచేసే శక్తికి సంబంధించిన సమాచారం, వివరమైన ఎలెక్ట్రో కార్డియో గ్రాఫిక్, ఐక్సార్ కార్డియో గ్రాఫిక్ అన్వేషణలు; యింకా చాలా పరిశీలనలు బయలుదేరడానికి సరిగ్గా ముందర రోదసీ నౌకా చోదకుని ఆరోగ్య పరిశీలనకు అవసరమైన మొత్తాన్నీ, కూలంకషత్వాన్నీ చేకూర్చాయి. ఇదే సమయంలో ఆయన నిరంతర వైద్య, మానసిక పర్యవేక్షణ క్రింద పెట్టబడ్డారు. బయో కెమికల్, ఇమ్యునొలోజికల్ పరీక్షలు, ఆయన నరాల పరిస్థితి, భావోద్రేక పరిస్థితిపై పరీక్షలు జరుపబడ్డాయి.

తన యాత్రా సమయమంతటా యూరీ గగారిన్ వైద్య పర్యవేక్షణ క్రింద వున్నారు. తన స్థితిని గురించి రేడియోలో ఆయన పంపిన సందేశాలే కాకుండా, వైద్యులు, శరీర శాస్త్రజ్ఞులూ రోదసిలోనికి వెళ్ళిన తొలి మానవుని హృదయ స్పందనం గురించి, ఉచ్ఛ్వాస నిశ్వాసాల గురించీ నమోదు చేయడానికి రేడియో టెలి మెట్రిక్ విధానాలను ఉపయోగించారు.

జీవశాస్త్ర సంబంధమైన టెలిమెట్రీ సేకరించిన విస్తారమైన అను

ధవం—వైద్య శాస్త్రం, ఎలెక్ట్రానిక్స్ సరికొత్త విజయాలతో కూడిన ఒక కొత్త విజ్ఞాన శాస్త్రం—1961 ఏప్రిల్ 12న మానవ సేవకు వినియోగింప బడింది. ఆ ఘనమైన యాత్ర సురక్షితంగా జరగడానికి బయో టెలిమెట్రీ ఎంతో తోడ్పడింది. దీని పాత్రను అతిశయోక్తిగా చెప్పలేము. రోదసీ యానపు దుస్తులలోనే సులభమైన సదుపాయమైన ఏర్పాట్లు చేయబడ్డాయి, ఇవి శరీర సంబంధమైన పారామీటర్లను—హృదయ స్పందనానికీ, వాస్క్యులర్ వాల్స్‌యొక్క నాడీ చలనాలనూ, ఉచ్ఛ్వాస నిశ్వాస గమనాలనూ—విద్యుత్ సంకేతాలుగా మార్చుతాయి. ఉచితమైన ఆంప్లి ఫైయర్లు, కొలత పద్ధతులు రేడియో మార్గాలద్వారా యాత్రా సమయమంతటా ఉచ్ఛ్వాస నిశ్వాసాల యొక్క, రక్త ప్రసారం యొక్క తీరులను తెలియజేశాయి.

టెలి మెట్రిక్ సమాచారం ద్వారా లభించిన ప్రాథమిక వివరాలను బట్టి, వైద్యశాస్త్ర దృష్ట్యా గగారిన్ యాత్ర అత్యంత జయప్రదంగా జరిగింది. నాడి, శ్వాస యాత్రా సమయంలోనూ, దిగేటప్పుడూ, యీ యాత్రకు ముందర జరిగిన అనేక పరీక్షల సమయంలో జరిగినట్టుగానే యించుమించుగా మార్పు చెందాయి. రోదసీ నౌకా చోదకుడు భార రహిత స్థితిలోనికి ప్రవేశించినప్పుడు హృదయ స్పందనం, శ్వాస మామూలు స్థితికి తగ్గాయి.

ఈ విధంగా మనిషితో రోదసీ యాత్రా సమయంలో బయో టెలి మెట్రీని వైద్య పరీక్షకు మొదటిసారిగా ఆచరణలో పెట్టినప్పుడు, అది గొప్పగా జయప్రద మయ్యింది. ఈ రంగంలో పనిచేస్తోన్న మా విజ్ఞాన శాస్త్రజ్ఞులు సరియైన మార్గంలో వున్నారనడానికి యిదొక సూచన. ఇది భావి విజయాలకు అవకాశం యిస్తుంది.

చరిత్రలో మానవుని ప్రథమ రోదసీ యాత్ర, రోదసిలో మానవుని స్థితిని గురించి ఎంతో విలువైన సమాచారాన్ని సేకరించిందనీ; మానవుని రోదసీ యాత్రావకాశాన్నే కాకుండా, మానవుడక్కడ తన సృజనాత్మక శక్తులను కోలుపోవడనీ, వివిధ కార్యకలాపాలను సాగించగలడనీ సోవియట్ శాస్త్రజ్ఞులు చెప్పిన జోస్యం నిజమయ్యిందనీ గుర్తించవలసి వుంటుంది.

ఈ విజయంలో విజ్ఞాన శాస్త్రజ్ఞులూ, పనివాళ్ళూ గొప్ప పాత్రను నిర్వహించారు. గణనీయమైన సోవియట్ పౌరుడు యూరీ గగారిన్, ఆయన స్నేహితులు, భార్య బంధువులూ గొప్ప వీరోచిత పాత్రను నిర్వర్తించారు.

# వై. కె. ఫెదొరోవ్ ప్రకటన

గగారిన్ యాత్రకు సంబంధించిన మొదటి భోగట్టా మాత్రమే యిక్కడ చెప్పబడింది. ఇతర నివేదికలూ, వైజ్ఞానిక సమాచారమూ తరవాత ప్రచురింపబడతాయి.

ప్రథమ రోదసీ యాత్రికుడైన యూరీ అలెక్సేయేవిచ్ గగారిన్‌తో యీ సమావేశాన్ని యిక్కడవున్న వారు జీవితాంతమూ జ్ఞాపకం పెట్టుకుంటారు. ఆయన ధైర్యాన్ని ప్రపంచం మెచ్చుకుని, ఆయన నిపుణతనూ ఇంతకుముందర తెలియని అతి కష్టమైన దారి రోదసీ యాత్రను ఆయన సాగించిన అద్భుతమైన రీతినీ గాఢమైన గౌరవాన్ని వ్యక్తం చేస్తుంది.

గగారిన్ రోదసిలో ఒంటరిగా వున్నప్పటికీ, రోదసీ నౌకను నిర్మించి దానిని ఎగిరేటట్టుగా చేసిన ఫాక్టరీ కార్మికుల, ఇంజనీర్ల విజ్ఞాన శాస్త్రజ్ఞుల గొప్ప కృషిని ఆయన మహాకార్యం ప్రతిబింబిస్తుంది.

మొదటి సోవియట్ స్పూత్నిక్ పైకి పంపబడినప్పుడు విదేశాల లోని కొందరు—యిక్కడవున్న పశ్చిమ దేశాల పత్రికా ప్రతినిధులైన మీలో కొంతమంది వారిలో వున్నారేమో—సోవియట్ దేశం సాధించిన వ్యక్తిగతమైన సాంకేతిక సాధనా ఫలితమని అభిప్రాయ పడ్డారు. ఇప్పుడీ భావాన్నెవరూ ఒప్పుకోరు. మొదటి స్పూత్నిక్ యాత్ర అయ్యాక గడిచిన కొద్ది కాలంలో, రోదసిలో సోవియట్ విజయాలు సోషలిస్టు దేశపు ఇంజనీరింగ్, విజ్ఞాన శాస్త్రాల అభివృద్ధిలో ఒక సహజ దశ అని అందరికీ స్పష్టపడింది.

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గమూ, సోవియట్ దేశ మంత్రివర్గమూ రోదసీ అన్వేషణలో యీ విజయం తమ విజయంగానే కాకుండా, యావత్తు మానవాళి విజయంగా కూడా సోవియట్ ప్రజలు పరిగణిస్తున్నారని తమ విజ్ఞప్తిలో నొక్కి చెప్పాయి.

"ప్రగతికొరకు, ప్రపంచంలోని సకల ప్రజల సౌఖ్యం శ్రేయస్సుల కొరకు దీనిని మేము సంతోషపూర్వకంగా అర్పిస్తాము. శాంతి సేవకు ప్రజల భద్రతకొరకు మా విజయాలనూ, మేము కనుగొన్న విషయాలనూ ప్రయోగిస్తాము; యుద్ధం కొరకు ఉపయోగించము." మొదటి స్పూత్నిక్ ఎగురవేత, రోదసిలో ఎటువంటి ప్రత్యేకమైన హక్కులనూ కోరడానికి సోవియట్ దేశాన్ని ప్రేరేపించలేదని మీకు బహుశా జ్ఞాపకం వుండవచ్చు. చంద్రమండలం పైని సోవియట్ రాజ్య చిహ్నం దిగడం, సోవియట్ దేశం చంద్రమండలంలో యెటువంటి ప్రాంతాలనూ సంపాదించడానికి దారితియ్యలేదు.

మా విజ్ఞాన శాస్త్రజ్ఞులు తాము సాధించిన ఫలితాలను పలు అంతర్జాతీయ సమావేశాలలో తెలియజేస్తారు, ప్రపంచంలోని సకల దేశాల నుండి వచ్చిన తమ తోడి శాస్త్రజ్ఞులతో వాటినిగురించి చర్చిస్తారు. ఇప్పుడు కూడా కొంతమంది సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు అకెడిమీషియన్ బ్లగోన్ రవోవ్‌తో బాటుగా, అంతర్జాతీయ రోదసీ పరిశోధనా సంఘం యొక్క వైజ్ఞానిక సమావేశంలో పాల్గొంటున్నారు. దానిలో పాల్గొంటున్నవారంతా మాతోబాటుగా, మానవ ప్రతిభ సాధించిన యీ కొత్త మహత్తర విజయానికి అభినందిస్తున్నారు.

రోదసిలోనికి యీ ప్రథమ మానవయాత్ర ద్వారా. సోవియట్ ప్రజలు మానవ విజ్ఞాన విజయాల నిధిని అభివృద్ధి చేశారు.

ప్రస్తుత వైజ్ఞానిక, సాంకేతిక ప్రగతి గొప్పగా వున్నది. అయితే యిది యింకొంత వేగాన్ని అందుకొంటుందని గుర్తించవలసి వుంటుంది.

రోదసిలోని భావి యాత్రల గురించీ, చంద్ర మండలం యితర

గ్రహాల పరిశోధన గురించీ, పదార్థం లోలోపలి రహస్యాల అన్వేషణ గురించీ, ప్రధాన క్రమాల మూల సూత్రాల గురించీ విజ్ఞాన శాస్త్రజ్ఞుల ఆలోచనలు లగ్నమై వున్నాయి. అయితే ప్రపంచంలో ఎంతగా అవ్యవస్థ ఇంకావున్నదో—యిది కూడా మనకు స్పష్టంగా కనిపిస్తూవున్నది. ప్రపంచం లోని కొన్ని ప్రాంతాల్లో ప్రజలు పస్తులు పడుతూ వుండడం, మానవ జాతికి సిగ్గుచేటయిన విషయం కాదా? ఇది కఠినమైన మాటగా వుంటుంది భ్రష్టపరిచే వారికి, క్రూరంగా దోపిడీ చేసేవారికీ, కొన్నిచోట్ల అభివృద్ధిలో వెనుకబడివున్న దేశాలను యీనాటికీ దోపిడీ సాగిస్తూనే వున్నవారికీ.

ఆఫ్రికా మీదగా వెళ్తూ కామ్రేడ్ గగారిన్, కాంగోలీస్ ప్రజల సౌఖ్యం కొరకు పరాక్రమంతో పోరాడిన వీరుడు, యిటీవలనే నీచంగా హత్య చేయబడిన లుముంబా దేశం కాంగోను చూశారు.

ప్రపంచ మంతటా హృదయ శుద్ధిగల వారికి యిటువంటి పరిస్థితులు ఆందోళనను కలిగిస్తాయని సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞు లెరుగుదురు. విజ్ఞాన శాస్త్రం, ఇంజనీరింగ్ అభివృద్ధి ప్రకృతి శక్తుల పైని ఆధిపత్యాన్ని సంపాదించడానికి అపారమైన అవకాశాలు కలిగిస్తుంది. మానవ సంక్షేమానికి వాటిని వినియోగ పర్చడం మన కర్తవ్యం, మన ఉమ్మడి బాధ్యత. దీని సాధనకు, అన్నిటికంటె ముఖ్యంగా శాంతి స్థాపన అవసరం.

మానవ ప్రతిభ నూతన విజయాన్ని సాధించిన యీనాడు సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులమైన మేము, పశ్చిమ దేశాల పత్రికా ప్రతినిధులైన మిమ్ము, మీ పాఠకులకూ, సకల ప్రపంచ ప్రజలకూ సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ యావత్తు ప్రపంచానికీ చేసిన పవిత్రమైన విజ్ఞప్తిని తెలియజెయ్యమని కోరుతున్నాము. సకల ప్రజలూ జాతి, తెగ, రంగు, మతం, సంఘంలో స్థానం ప్రసక్తి లేకుండా శాశ్వత శాంతి స్థాపనకు సర్వశక్తులా కృషిచెయ్యమని యీ విజ్ఞప్తి కోరుతోంది. శాశ్వత శాంతికి నిజమైన, త్వరితమైన మార్గం చాల కాలంగా తెలిసినదే. అది ఖండితమైన అంతర్జాతీయ నియంత్రణతో సార్వత్రిక సంపూర్ణ నిరాయుధీ కరణ. ఈ మూల కర్తవ్యం నెరవేరినట్టయితే, ప్రపంచ ప్రజలంతా

రోదసీ పరిశోధన కోసం, నిజంగా మానవునికి అర్హమైన యితర పనుల కోసమూ పాటుపడడానికి అవకాశం కలిగిస్తుంది.

*  *  *

ప్రశ్నలలో చాలా భాగం నేరుగా యూరీ గగారిన్‌ను అడగబడ్డా యని, అధ్యక్షత వహించిన అకెడిమిషియన్ ఏ. యన్. నెస్మియనోవ్ చెప్పారు. తనకు సంబంధించిన కొద్ది ప్రశ్నలకు జవాబిస్తానని ఆయన చెప్పారు.

చాలా ప్రశ్నలలో రోదసిలోనికి మానవుణ్ని పంపడానికి ప్రాథమిక ప్రయత్నాలు జరిగాయా అని అడగబడింది. విదేశ పత్రికలలో యీ ప్రస్తావన వచ్చింది.

నా జవాబు: అటువంటి ప్రయత్నాలు జరగలేదు. యూరీ గగారిన్ ప్రథముడు. ఆయన ప్రయత్నం జయప్రద మయ్యింది (హర్షధ్వానులు).

ఇంకో ప్రశ్న: మానవుణ్ని రోదసి లోనికి పంపడం నిజంగా అవ సరమా అన్న విషయంపైని విజ్ఞాన శాస్త్రజ్ఞులకు భేదాభిప్రాయాలున్నాయి. ఈ ఉదాహరణ, అటువంటి అవసరమున్నదని రుజువు చేస్తుందా?

ఛాయాచిత్రాలతోనే మేము సంతృప్తి పడిపున్నట్టయితే,—ఉదాహర ణకు చంద్రుని ఆవలి భాగానివి—అప్పుడు బహుశా యీ ప్రశ్నకు అవు నని జవాబివ్వవచ్చును. అయితే మాస్కోలో యింతమంది విదేశ పత్రికా విలేఖరులుండడం సామాన్యంగా ఛాయాచిత్రాలతో సరిపోదనీ, లేదుకు తామే ప్రత్యక్షంగా పరిస్థితులను అందరూ చూడాలని అనుకుంటారనీ రుజువవు తోంది. (హర్షధ్వానులు).

ఇంకో ప్రశ్న: నికితా కృశ్చేవ్ తన ప్రసంగంలో యూరీ గగా రిన్ యాత్ర రోదసిలోని మొదటి సోవియట్ విహంగమని అన్నారు. తరవాతది ఎప్పుడు వెళ్తుందని ఆశించవచ్చును? రోదసీ పరిశోధనలో సోవియట్ దేశం అమెరికాకు ముందర వుండడం ఎందుచేత?

ప్రతి క్లిష్ట విషయానికి వలెనే బహుశా దీనికూడా చాలా కారణా లున్నాయని నెస్మియనోవ్ జవాబిచ్చారు. త్సియొల్కోవ్‌స్కి సోవియట్

దేశంలో జీవించాలని జ్ఞాపకం పెట్టుకోండి. విప్లవానికి పూర్వపు రష్యాలోనే, రోదసీ యాత్రల గురించి సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంలో ప్రథముడాయన. అయితే సోషలిస్టు రాజ్యంలో వైజ్ఞానిక-సాంకేతిక కృషిని సమీకరించడానికి, పలు పరస్పరం సంఘర్షించే ప్రయోజనాలు గల వ్యక్తిగత ఆస్తిపైని ఆధారపడిన సమాజంలోకంటె ఎక్కువ అవకాశాలున్నాయని నా అభిప్రాయం. ఇదే దీనికి ముఖ్య కారణం. ఈ రెండు కారణాలకూ మనం బద్ధులమై వుందాము.

తరవాత యూరీ అలెక్సియేవిచ్ గగారిన్ ప్రశ్నలకు జవాబు, చెప్పారు.

భూమికి దిగడం ఎలా జరిగిందన్న విషయంపైని నాకు చాలా ప్రశ్నలు వచ్చాయి. వెంటనే వాటన్నిటికీ జవాబివ్వడానికి అనుమతించండి.

మన దేశంలో యీ భూమికి దిగే పద్ధతి, పలుతీరులలో వివరింప బడింది. పారాషూట్‌లో దిగడంకూడా యిందులో వుంది. ఈ దిగువ పద్ధతి యీ యాత్రలో అవలంబింప బడింది: చోదకుడు కోశంలో వున్నాడు, గొప్ప ప్రావీణ్యాన్ని భూమికి దిగే వ్యవస్థలన్నిటి అద్భుతమైన పనినీ తెలుపుతూ యిది జయప్రదమయ్యింది.

ప్రశ్న : ఓస్తోక్ నుండి తీయబడిన భూతల ఛాయా చిత్రాలు ప్రచురింపబడతాయా ?

జవాబు : ఓస్తోక్‌లో కెమేరాగాని, ఛాయా చిత్రాలు తీసే సాధనం గాని లేదు. ఛాయా చిత్రాలేవీ తీయబడలేదు. అంచేత ప్రచురణకు ఏమీ లేదు.

ప్రశ్న : యాత్రా సమయంలో మీకు ఎక్కువగా ఆకలిగాని దాహంగాని వేసిందా ?

జవాబు : యాత్రలో నాకు ప్రత్యేకమైన ఆకలిగాని, దాహంగాని వెయ్యలేదు. కార్యక్రమం ప్రకారం తినవలసిన సమయమైనప్పుడు, యిక్కడ, భూమి మీద వున్నప్పటిలాగే వుంది నాకక్కడ.

ప్రశ్న : మీరు మొదటి అభ్యర్థి అని మీకు ఎప్పుడు చెప్పబడింది ?

జబాబు : నేను మొదటి అభ్యర్థినని నాకు సకాలంలోనే చెప్ప బడింది (నవ్వు, హర్షధ్వనులు). పూర్తిగా సిద్ధపడడానికి నాకు కావలసి నంత వ్యవధి వుంది.

ప్రశ్న : ఈ చరిత్రాత్మకమైన యాత్రలో రేడియో కమ్యూనికేషన్స్ పాత్రగురించి మీ అభిప్రాయమేమిటి ? రోదసిలో భూమి నుండి వచ్చే గొంతు ఎలా వినిపిస్తుంది ?

జబాబు : యాత్రా సమయంలో రేడియో కమ్యూనికేషన్స్ పాత్రను ఎంతో విలువైనదానిగా పరిగణిస్తున్నాను. నాకు నిరంతరం భూమితో సంబంధం పెట్టుకునే అవకాశం, ఆజ్ఞలను పొందడానికీ, అన్ని వ్యవస్థల పనిగురించీ రోదసీ నౌక నుండి భోగట్టాను అందజేయడానికీ, పరిశీలనలను ప్రసారం చేయడానికీ; మా ప్రజల, ప్రభుత్వం యొక్క, కమ్యూనిస్టు పార్టీ యొక్క నిరంతర సహాయాన్ని పొందుతున్నానన్న, యాత్రలో ఒంటరిగా లేనన్న భావాన్ని పొందే అవకాశమూ నాకు లభించాయి.

ప్రశ్న : నేలపైనున్న బృందం, భూమికి దిగడానికి ముందర వచ్చిందా, తరవాత వచ్చిందా ?

జబాబు : భూమికి దిగడమూ, నేలపైనున్న బృందం రావడమూ యించుమించు ఒకేసారి జరిగాయి.

ప్రశ్న : మీ బరువెంత ?

జబాబు : యాత్రకు ముందర నా బరువు 69.5 కిలో గ్రాములు. నా ప్రస్తుత బరువు కూడా అంతే.

ప్రశ్న : భూమికి దిగేటప్పటి పొడవెంత ?

జబాబు : భూమికి దిగేటప్పటి పొడవును, దాని కాలం తెలియ జేసింది. విడిపోవడానికి సంబంధించిన నిర్మాణం 10.25కు పని చెయ్యించ బడింది. భూమికి దిగడం 10.55కు జరిగింది. ఈ విధంగా దూరం అనేక వేల కిలోమీటర్లు.

ప్రశ్న : బాలిస్టిక్ రాకెట్లలలో మీరు ప్రాథమిక యాత్రలు చేశారా?

జబాబు : లేదు, నేను చెయ్యలేదు.

ప్రశ్న : కుటుంబం, యిద్దరు బిడ్డలూ వున్న మీరు రోదసిలోనికి పంపబడడం—అంటే ప్రభుత్వమూ మీరూ యీ యాత్ర జయప్రదమవు తుందని విశ్వసించారన్న మాటేనా ?

జబాబు : ఈ ప్రశ్నలో 'పంపబడడం' అన్న మాట బదులు 'అప్పగింపబడడం' అని అంటే మంచిది. ఈ విశ్వాసానికి నేనెంతో సంతోషిస్తున్నాను, గర్విస్తున్నాను. ఇక విశ్వసించడం విషయంలో ప్రతి ఒక్కటీ జరిగిపోతుందనడానికీ, యాత్ర జయప్రదమవుతుందనడానికీ, ఎవ్వ రికీ ఎటువంటి సందేహాలూ లేవు—మా ప్రభుత్వానికిగాని, మా శాస్త్రజ్ఞు లకుగాని, మా ఇంజనీర్లకు గాని నాకు గాని. (హర్షధ్వానాలు).

ప్రశ్న : యాత్రా సమయంలో మీరేమి తిన్నారు ? అది మామూలు భోజనమా, లేకపోతే భారరాహిత్య పరిస్థితులలో పోషకమైన ఏదైనా ప్రత్యేక ఆహారమా ?

జబాబు : వైద్యశాస్త్ర పరిషత్తు తయారు చేసిన ప్రత్యేకాహారం.

ప్రశ్న : మీ ఆప్తుల ఛాయా చిత్రాలుగాని, ఏవేనా తాయత్తులుగాని రోదసిలోనికి మీరు తీసుకవెళ్ళారా ?

జబాబు : శకునాలు, తాయత్తులలోగాని, యిటువంటివి యింకా వేటిలోగాని నాకు నమ్మకం లేదని మీకు నేను హామీ యిస్తున్నాను. నా దగ్గర ఏ ఛాయాచిత్రాలూ లేవు. ఎంచేతనంటే నేను తప్పక భూమికి వచ్చే స్తాననీ, భూమిపైని నా ఆప్తులను నా కళ్ళతోనే చూస్తాననీ నాకు తెలుసు గాబట్టి. (హర్షధ్వానాలు).

ప్రశ్న : రోదసీ నౌకగాని, దాని ఏ భాగం గాని యింకోసారి ఉపయోగింపబడుతుందా ?

జబాబు : ఈ ప్రశ్నకు జబాబు చెప్పగల సమర్థులు మా సాంకే తిక విషయజ్ఞులు, ఇంజనీర్లు. అయినా యావత్తు రోదసీ నౌక, దాని సామగ్రి యింకో రోదసీ యాత్రకు ఉపయోగించవచ్చునని నేను చెప్పితే తప్పుకాదనుకుంటాను.

ప్రశ్న: దక్షిణ అమెరికా పైని వెళ్లుతూ మీరు బాగా వున్నారని తెలియజేశారు. దక్షిణ అమెరికా నివాసిగా మిమ్ములను ఒకటి అడగ దలుచుకున్నాను రోదసి ఎత్తునుండి మా ఖండం అందంగా కనిపించిందా?

జబాబు: చాలా అందంగా వుంది. (నవ్వు).

ప్రశ్న: కొత్త రోదసీ యాత్రలో మీతోడి రోదసీ నౌకా చోదకులు పాల్గొనడానికి సిద్ధంగా వున్నారని మీరన్నారు. ఎంతమంది వారు వున్నారు? డజనుకు పైగా వున్నారా?

జబాబు: మా దేశం, రోదసీ నౌకా చోదకులకు, దాని రోదసీ అన్వేషణా కార్యక్రమాన్ననుసరించి శిక్షణ నిస్తోంది. మంచి రోదసీ యాత్రలను సాగించడానికి చాలినంతమంది వున్నారనుకుంటాను (హర్షధ్వనులు).

ప్రశ్న: విజ్ఞాన శాస్త్రజ్ఞులు తయారుచేసిన కార్యక్రమం అంతట్నీ మీరు నెరవేర్చారా? ఇంతకంటె పెద్ద కార్యక్రమాన్ని మీరు కష్టం లేకుండా నెరవేర్చగలిగి వుండేవారా?

జబాబు: నా యావత్తు కార్యక్రమాన్నీ నేను నెరవేర్చాను. ప్రశ్నలో తక్కిన భాగం విషయం—కార్యక్రమం నెరవేర్చబడగలిగేటట్టుగా వెయ్యబడిందనుకుంటాను. నేను చెయ్యవలసిందంతా చేశాను.

ప్రశ్న: అనేక గంటలు పట్టే, లేదా అనేక రోజులు పట్టే యిటువంటి కక్ష్య వెంబడి రోదసీ యాత్ర, చోదకునికి శారీరకమైన, లేదా మానసికమైన యిబ్బందిని కలిగిస్తుందనుకుంటారా?

జబాబు: కక్ష్యలో నా స్థితినిబట్టి, నేను యీవిధంగా నిర్ణయిస్తాను. వ్యక్తిగతంగా చెప్పాలంటే, నేను వున్నదానికంటె యింకా చాలా ఎక్కువకాలం వుండగలిగేవాణ్ని.

ప్రశ్న: ఈ యాత్ర మీ రాజకీయ విశ్వాసాలను దృఢపర్చడానికి ఉపయోగపడిందా? సంపూర్ణ నియంత్రిత నిరాయుధీకరణను సాధించడం అవసరమని మీరు చెప్పిన భావాన్ని యిది ధృవీకరిస్తున్నదా? ఎందుచేత?

జబాబు: ఈ ప్రశ్నకు యింకేదీ చెప్పడం నాకు కష్టమనిపిస్తున్నది. అకెడమీషియన్ ఫెదొరోవ్ చెప్పినంత బాగా స్పష్టంగా చెప్ప

లేనేమో అనిపిస్తోంది. ఈ ప్రశ్నకు ఆయన పూర్తిగా జవాబిచ్చారను కుంటాను.

ప్రశ్న: మీ యాత్రలో వాస్తవ పరిస్థితులు, మీరు ఊహించిన వాటికి భిన్నంగా వున్నాయా? అలా అయినట్టయితే, ఏ విధంగా?

జవాబు: నేను వ్రాసిన ఒక పుస్తకంలో కె. ఇ. త్సియొల్కొవిస్కీ రోదసి యాత్రకు సంబంధించిన అంశాలనుగురించి అద్భుతమైన వర్ణన యిచ్చారు. ఆయన వర్ణించిన వాటికి భిన్నంగా లేవు, నాకు యెదురైన పరిస్థితులు.

ప్రశ్న: రోదసి నుండి మీ మాతృదేశానికి మీరు తిరిగి వచ్చినప్పుడు మీకు కలిగిన భావాలను వర్ణించగలరా?

జవాబు: అప్పుడు నాకు కలిగిన భావాలను చెప్పడం కష్టం. అవి సంతోషం, గర్వం, సౌఖ్యం. సౌఖ్యం ఎందువల్లనంటే నేను నా కప్పగించబడిన బాధ్యతను నెరవేర్చినందువల్ల, సోవియట్ దేశం, దాని శాస్త్రజ్ఞులు యీ యాత్రను నెరవేర్చినందువల్ల, మా ఉన్నత విజ్ఞాన శాస్త్రం యింకో ముందడుగు వేసినందువల్ల.

ప్రశ్న: మీ జీతం ఎంత? ఈ యాత్ర చేసినందుకు మీకేదైనా ప్రత్యేక బహుమతి వచ్చిందా?

జవాబు: నా జీతం, సోవియట్ ప్రజలందరి జీతాల్లాగనే నా అవసరాలకు పూర్తిగా చాలును.

ఉన్నతమైన సోవియట్ దేశ వీర బిరుదం నాకు యివ్వబడింది. అది అత్యున్నతమైన బహుమానం.

ప్రశ్న: మీరు రెండోసారి రోదసీ యాత్ర చేస్తానని అనుకుంటున్నారా? లేకపోతే యింకెవరేనా వెళ్తారా?

జవాబు: ఏ నూతన కర్తవ్యాన్నయినా నెరవేర్చడానికి నేను సిద్ధంగా వున్నానని, నేను మందరే పార్టీకీ, ప్రభుత్వానికీ నివేదించాను.

సోవియట్ దేశ రోదసీ నౌకా చోదకుడన్న బిరుదాన్ని నేను స్వీకరించాను. ఇది నాకు రోదసీ యాత్రకు అర్హత కల్పిస్తుంది. రెండో యాత్ర

నాకు అప్పగింపబడినట్టయితే నేను సంతోషిస్తాను, కృతజ్ఞుణ్నవుతాను. ఈ యాత్రను చెయ్యడానికి యిష్టపడే రోదసీ నౌకా చోదకులు చాలా మంది మా కున్నారనుకుంటాను.

ప్రశ్న : మీరు భూమిని బాగా చూశానని చెప్పారు. అంటే రోదసీ నౌక కిటికీ ద్వారా చూశానా, లేక రంగుల టెలివిజన్ కెమేరా వుందా ?

జబాబు : రోదసీ నౌకలోని ఒక కంతద్వారా దానిని చూశాను.

ప్రశ్న : ఇంకో రోదసీ యాత్ర ఎప్పుడు జరుగుతుంది ?

జబాబు : తగిన సమయంలో మా విజ్ఞాన శాస్త్రజ్ఞులూ, రోదసీ నౌకా చోదకులూ యీ యాత్రను జరుపుతా రనుకుంటాను.

ప్రశ్న : రోదసీ నౌకా చోదకుల సంఘానికి మీరు అధ్యక్షునిగా వుంటారా ?

జబాబు : ఇది నామీద ఆధారపడి వుండదని మాత్రమే చెప్ప గలను. నేను ఎన్నుకోబడినట్టయితే, వుంటాను.

ప్రశ్న : ప్రస్తుత కార్యక్రమంలో ఓస్తోక్ పైని చంద్రమండలానికి మీరు ప్రయాణించగలిగి వుండేవారా ?

జబాబు : ఓస్తోక్ రోదసీ నౌక, చంద్రమండల యాత్రకొరకు నిర్మించబడలేదు. ప్రత్యేకమైన నౌకలు ఇందుకొరకు సృష్టించబడుతున్నాయి, అవి నిర్మింపబడతాయి

* * *

పత్రికా విలేఖరుల గోష్ఠి ముగిసింది. మళ్ళీ అక్కడే వారంతా యూరీ గగారిన్‌కూ, సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులకూ, డిజైనర్లకూ, ఇంజినీర్లకూ, కార్మికులకూ—మానవాళిని నూతన శకంలో ప్రవేశపెట్టిన వారందరికీ నివాళు లర్పించారు.

# మానవ హేతుశక్తికి విజయం

## రోదసిపై విజయానికి పెద్ద ముందంజ

అనేక వేల సంవత్సరాలనుంచీ కూడా, అన్నీ తెలుసుకోవాలన్న జిజ్ఞాసగల మానవుడి మనస్సు విశ్వాంతరాళంలోకి చొచ్చుకుపోవాలనే ప్రయత్నిస్తూ వుంది. తీర్చటానికి సాధ్యంకాని మానవుడి జ్ఞాన తృష్ణనీ, ఈ మహా విశ్వంలో తన స్థానం ఏమిటో కొలుచుకోవాలన్న అతడి వాంఛనీ, ప్రకృతిని నడిపించే సూత్రాలనీ అధీనంలోకి తెచ్చుకోటం ఎట్లాగో తెలుసుకోవాలి అన్న కోరికనూ ఇది ద్యోతకం చేస్తున్నది.

విశ్వాంతరాళాన్ని పరిశోధించేందుకు అనేక సాధనాలు విజ్ఞానశాస్త్రం అధీనంలో వున్నాయి. ఈ సాధనాలవల్ల ఇప్పటికే అందుబాటులోకి వచ్చిన దూరాలు ఖగోళ శాస్త్రంలో తటస్థపడే సంఖ్యల్లోకి వెడుతున్నాయి.

విశ్వం అన్నది నక్షత్రాలూ, నక్షత్ర సమూహాలూ, పాలపుంతలూ— వీటితో వున్న ప్రపంచం, మన సౌర కుటుంబం, వీటిల్లో ఒకటి. పదార్థ రూపాలన్నిటిలోకీ అత్యున్నతమయిన జీవ పదార్థం రూపొందటానికి అవకాశమిచ్చే పరిస్థితులున్నటువంటి మన ప్రపంచంవంటి ప్రపంచాలు అనేకం వున్నాయని ఉన్నత విజ్ఞానశాస్త్రం గతితార్కిక భౌతిక వాదపు సూత్రాల సహాయంతో ఉద్ఘాటిస్తున్నది. విశ్వంలో జీవుల పుట్టుక అన్నది కేవలం అపురూపమయిన విషయం కాదు. మన సౌర కుటుంబంతో పాటు జీవ పదార్థం అన్నది మరింక ఎక్కడయినా వున్నదా? అది మరొక రూపంలో వుందా? అన్న అంశాలు నిక్కచ్చిగా చెప్పలేము కాని, అది వున్నదన్న మాట మాత్రం ఖాయం.

భూమిమీద మనుష్యుడు జన్మించటం, ఒక గ్రహంగా భూమి పరిణా

షంలో విశిష్టమయిన ఒక నూతన పరిణామానికి నాంది అయింది. ప్రకృతి సూత్రాలని గుర్తించటంతో, మానవుడు ఈ స్వరూపాన్నే మార్చటానికి ప్రయత్నాలు ప్రారంభించాడు. ప్రకృతిని ఎదుర్కొనేందుకు మహత్తరమైన సాధనాలు ఏర్పరుచుకున్నాడు. రాతి గొడ్డలి ఉపయోగించే దశనుంచి మనుష్యుడు అంతరిక్ష యానం మొదటిసారిగా చేయగలిగిన స్థితిలోకి వచ్చాడు.

అంతరిక్షంలోకి వెళ్ళటంతో మానవుడు పూర్తిగా కొత్త ప్రపంచం పరిశోధిస్తున్నాడు. కొత్తచోటికి ప్రవేశిస్తే, తరుచూ ఊహించటానికి కూడా వీల్లేని కొత్త అంశాలని కనిపెట్టటం జరుగుతుందన్న సంగతి మనకు తెలుసు. ఉదాహరణకి మొదటి స్పూత్నిక్‌లను తీసుకోండి. భూమి చుట్టూ కిరణ మండలాలు వున్నాయన్న సంగతి వీటివల్ల తెలిసింది. దానివల్ల, సౌర మండలాన్ని పరివేష్టించుకుని వున్న ప్రదేశం గురించి మనకున్న అభిప్రాయాలు ఎంతో మారిపోయాయి. అంతరిక్షయానంలో కిరణ ప్రసార ప్రమాదాలను గురించి అభిప్రాయాలు కూడా మార్చుకున్నాము.

అంతరిక్ష యానాల పూర్తి పర్యవసానాలేమిటో, వాటి ప్రాధాన్యమేమిటో ఈనాడు అంచనా వేయటం కష్టం. అయితే ఒకటిమాత్రం స్పష్టం. అంతరిక్షంలోకి మానవుడు దూసుకుపోగలగడం అనేది మన పరిజ్ఞానపు హద్దుల్ని గణనాతీతంగా పెంచ గలుగుతుంది; విజ్ఞానానికీ, సంస్కృతికీ ఎంతో సౌష్టవం చేకూరుస్తుంది.

ఒక్కొక్క సంవత్సరం గడుస్తున్నకొద్దీ ఆధునిక విజ్ఞానం, సాంకేతిక శాస్త్రం—వీటి అభివృద్ధి మరింత సత్వరగతితో సాగిపోతున్నది. కేవలం పదిహేను, ఇరవై ఏళ్ళ కిందటకూడా ఊహాతీతంగా వున్న అంశాలని సాధిస్తున్న సంగతి ఇప్పుడు మనం చూస్తున్నాము. విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలు—ముఖ్యంగా అంతరిక్షయాన శాస్త్రం—ఇంకా శీఘ్రగతితో పురోగమిస్తాయనటానికి సందేహించ నక్కర్లేదు.

అతిత్వరలోనే అంతరిక్ష నౌకలని, మన ఉపయోగానికి అక్కరకి వచ్చే అనేక అంశాలని సాధించేందుకు ఉపయోగించటం జరుగుతుందని మనం ఊహించవచ్చు. వాతావరణ సూచనలూ, ఏయే ప్రాంతాల్లో మంచు

ఏవిధంగా పేరుకునిపుందో పరిశీలించటం, టెలివిజన్, రేడియో ప్రసారాలని 'రిలే' చేయటం, వాయు మండలానికి పైగావున్న విషయాల పరిశీలన— మొదలైనవన్నీ ఈ కార్యక్రమంలో తొలి ఘట్టాలే అవుతాయి. వాటి తర వాత, అంతరిక్ష నౌకలు మనుష్యులని తీసుకుని చంద్రమండలానికీ, సౌర కుటుంబానికి సంబంధించిన ఇతర గ్రహాలకూ వెళ్ళటం, జనాభాతో అంత ర్గ్రహ స్థావరాలను నెలకొల్పటం, అంతరిక్ష జీవితాన్ని మానవుడు సాధిం చటం—ఇవన్నీ జరుగుతాయి. ఇతర ప్రపంచాలతో సంబంధాలు నెల కొల్పటమన్నది ప్రస్తుతం ఎంతో విదూరంగా కనిపిస్తున్నా, అది ముందు ముందు సాధ్యం కావచ్చు.

మొదటిసారిగా మనుష్యుణ్ని అంతరిక్షంలోకి పంపటానికి సన్నా హాలు చేయటంలోనూ, తరవాత దాన్ని సాధించటంలోనూ కూడా, సోవి యట్ వైజ్ఞానికులనీ, రూపకల్పనచేసే సాంకేతిక నిపుణులనీ ఎదుర్కొన్న వైజ్ఞానిక, సాంకేతిక సమస్యల్లోకల్లా ముఖ్యమయిందేమిటంటే, మానవుడు సుఖంగా అంతరిక్షంలో ప్రయాణంచేసి, సుఖంగా భూమిమీదికి తిరిగి రావ టానికి కావలసిన అనుకూల పరిస్థితులు కల్పించటమే. ఈ వైజ్ఞానిక, సాంకేతిక సమస్యని పరిష్కరించటంకోసం అంతరిక్ష నౌకల రూపకల్ప నలో ఎంతో కృషి అవసరమయింది. ఎన్నోసార్లు అంతరిక్ష నౌకల్ని ప్రయో గించి పరీక్షించవలసి వచ్చింది.

మానవుడు విశ్వాంతరాళంలో పర్యటించగలగటమన్నది, భూమి చుట్టూ ఒక పరిధిలో పరిభ్రమించే పరిధీ నౌకలో పర్యటించటాన్ని పట్టి ఆధారపడి వుంటుంది కనుక, మొదట పరిధీ నౌకని సాధించటం అవసర మని, అంతరిక్షంలో మానవుడి పర్యటన విషయమై వివిధావకాశాలూ ఆలో చిస్తున్న సందర్భంలోనే గుర్తించారు. భూమిమీదనుంచి ఒక అంతరిక్ష నౌకని విసిరి, అది భూమ్యాకర్షణ వల్ల మళ్ళీ కిందపడే లోపల అదిచేసే ప్రయాణం—అంటే, క్షేపరేఖా యాత్ర—నిజానికి అంతరిక్షయాత్రే కాదు; ఆ మార్గంలో ప్రయాణం చేయటమన్నది కేవలం ప్రచారంకోసం ఆ పని చేయటమే అవుతుంది. ఈ కారణాలవల్ల క్షేపరేఖా యాత్ర ఉద్దేశాన్ని

మొదట్లోనే తిరస్కరించటం జరిగింది. అందువల్లనే, మొదటినుంచీ సోవి యట్ వైజ్ఞానికులూ, రూపకల్పన చేసే సాంకేతిక నిపుణులూ కూడా, పెద్ద పరిమాణం, బరువుగల అంతరిక్ష నౌకల్నీ, కృత్రిమ ఉపగ్రహాలనీ పెంపొం దించటానికి ప్రయత్నించారు; అంతేకాని, అది కేవలం యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన కాదు. సోవియట్ యూనియన్‌లో అంతరిక్ష యానం ఈ ప్రాతిపదిక సూత్రం ప్రకారం పెంపొందించటం జరిగింది. ఈ మార్గం వల్లనే మనుష్యుడు అంతరిక్ష యాత్ర జరపటమన్న చారిత్రక కర్తవ్యం సాధ్యపడింది.

పరీక్షార్థం, లైకా అనే కుక్కని అంతరిక్షంలోకి తీసుకుపోయిన రెండో సోవియట్ స్పూత్నిక్ మొదలుకుని అంతరిక్ష పరిధీ నౌక 'ఓస్తోక్' వరకూ, సోవియట్ శాస్త్రజ్ఞులూ, రూపకల్పనా నిపుణులూ కూడా యీ మార్గాన్నే అనుసరించారు.

అంతరిక్ష నౌకలు ప్రయాణం ప్రారంభించిన తరవాత, వాటిల్లో వుండే కంట్రోలు యంత్రాలు యెంతవరకూ నమ్మకంగా పనిచేస్తాయో పరీక్షించటం కోసం, అంతరిక్ష నౌకల రూపురేఖలూ, నిర్మాణం, వాటి యంత్రాలూ, వీటిని గురించి సాధ్యమైనంత సమాచారమంతా సేకరించటం అవసరమయింది. అంతరిక్ష పరిధీ నౌకలని ఎటు కావాలంటే అటు తిప్ప టానికి కావలసిన సాధనాలు రూపొందించటం, అవి సురక్షితంగా భూమి మీదకి తిరిగి రాగల ఏర్పాట్లు చేయటం—ఇది ఒక కొత్త రకపు ముఖ్య సమస్య అయింది.

అంతరిక్ష నౌకల్లో మనిషి ప్రయాణం చేసేందుకు వీలుగా వాటిల్లో మానవుడి జీవ ప్రక్రియలకి కావలసిన పద్ధతిలో గాలి, ఒత్తిడీ, ఉష్ణోగ్రతా ఉండేట్లు చూడటం అవసరం.

విశ్వాంతరాళ పరిశోధనల వల్ల, అంతరిక్షానికి సంబంధించిన ప్రాతి పదిక భౌతిక సమస్యలు పరిష్కారం కావటమే కాకుండా, అంతరిక్ష యాత్రా సందర్భంలో తటస్థించే కిరణ ప్రసార ఫలితాలు జీవకోటి మీద ఏ విధంగా వుంటాయి ? అంతరిక్షంలో పరిభ్రమించే ఉల్కలవల్ల అంత

రిక్ష నౌకలకి కలిగిన ప్రమాదాలు ఏమిటి?—అన్న అంశాల మీద కూడా అవసరమయిన సమాచారం లభించింది. ఈ సమాచారాన్ని ఆధారంగా తీసుకుని, అంతరిక్ష పరథీ నౌకలని కిరణ ప్రసారాలనుంచి కాపాడేందుకు తగిన ఏర్పాట్లు చేయటం జరిగింది.

మొట్టమొదటి సోవియట్ పరిథీ నౌకలు సాధించిన అమూల్య సమాచారం వల్లా, ఆ నౌకల్ని సురక్షితంగా భూమిమీదికి తీసుకు వచ్చేందుకు పెంపొందించిన సాధనాలవల్లా, అంతరిక్షంలోకి మనుష్యుణ్ని తీసుకు పోగల నౌకని రూపొందించేందుకు సోవియట్ వైజ్ఞానికులూ, రూప కల్పనా శాస్త్రజ్ఞులూ ఉపక్రమించగలిగారు. భారీఎత్తులో ఎంతో క్లిష్టంగా సాగిన యీ కృషి ఫలితంగా అంతరిక్ష నౌక 'ఓస్తోక్' నిర్మాణం జరిగింది. పరీక్షార్థం యీ నౌకని అంతరిక్షంలోకి పంపి, తిరిగి రప్పించటమన్నది చివరి రెండుసార్లూ 1961వ సంవత్సరం మార్చి నెలలో జరిగింది. ఈ రెండు ప్రయోగాల్లోనూ, పైలట్ కుర్చీలో ఒక బొమ్మని పెట్టి పంపారు. దానితోపాటు, చెర్నూష్కా, జ్వేజ్‌దోచ్కా అనే రెండు కుక్కలు కూడా వున్నాయి.

మనుష్యుడితో సహా అంతరిక్ష నౌకని పంపేందుకు ఉద్దేశించిన కార్యక్రమం ప్రకారం యీ రెండు ప్రయోగాలూ జరిగాయి. ఇవి రెండూ కూడా పూర్తిగా అనుకున్న ప్రకారమే జరిగి, నౌక రూపు రేఖలూ, అందులో యంత్రాలూ నమ్మకమైనవేనన్న అంశాన్ని ధృవపరిచాయి.

తొలి పరీక్షలు అతి జాగ్రత్తగా జరపటం వల్లనే, పరిథీ నౌక 'ఓస్తోక్'తొలి ప్రయోగంలోనే మనిషితో సహా జయప్రదంగా యాత్ర జరప కలిగింది. ఈ సంఘటన 1961 వ సంవత్సరం ఏప్రిల్ 12 వ తేదీన జరిగింది.

# అంతరిక్ష నౌక "ఓస్తోక్" రూపురేఖలు

మొదటి సోవియట్ పరిధి నౌకల అనుభవాన్ని పట్టి 'ఓస్తోక్' రూపు రేఖలు తీర్చటం జరిగింది.

ఉపగ్రహం మోస్తరుగా అంతరిక్షంలో సంచరించే యీ నౌకలో రెండు ముఖ్య భాగాలున్నాయి:

ఒకటి—పైలట్ కోశం. ఇందులో పైలట్ కూర్చునేందుకూ, అతడు జీవించటానికి కావలసిన ఏర్పాట్లూ, భూమిమీదికి దిగటానికి కావలసిన ఏర్పాట్లూ వున్నాయి. రెండో భాగం—పరిధిలో నౌక తిరిగేటప్పుడు పనిచేసే యంత్రాలూ, నౌక కిందికి దిగేటప్పుడు, వేగం తగ్గించే యంత్రాలూ ఇందులో ఉంటాయి.

అంతరిక్ష నౌక భూమి నుంచి బయలుదేరి కక్ష్యలో ప్రవేశించగానే, దాన్ని తీసుకవెళ్ళిన రాకెట్లలో చివరిది కిందపడిపోతుంది. నౌకలో యంత్రాలు ఒక నిర్ణీత క్రమం ప్రకారం స్వయంగానే కాకుండా, పైలట్ ఇష్టప్రకారం కూడా పనిచేస్తాయి. ఇవి పరిధిలో సమాచారాలని సేకరించి, కొలిచి, భూమిమీదికి పంపుతూ వుంటాయి. పైలట్ పరిస్థితులూ, అతడి బొమ్మా—వీటిని టెలివిజన్ ద్వారా భూమికి తెలియజేస్తూ వుంటాయి. భూమికీ, ఆ నౌకకీ, రేడియో సంబంధాలను నడుపుతూ వుంటాయి. పైలట్ జీవించటానికి కావలసిన గాలీ, ఒత్తిడీ, ఉష్ణోగ్రతా మొదలైనవి వుండేట్లు చూస్తూవుంటాయి.

మొదటిసారి ప్రయాణంలో, ఒకసారి భూమి చుట్టూ తిరిగే పనిచేసే యంత్రాలని అమర్చారు. కాని దాని రూపురేఖలూ, పరికరాలూ కూడా యింకా దీర్ఘ ప్రయాణాలకి వీలయినవే.

ఎంతవరకు ఎగరాలనుకున్నారో, ఆ కార్యక్రమం పూర్తికాగానే,

ఒక ప్రత్యేక సాధనం అంతరిక్ష నౌకని కిందికి దిగేటట్లు చేస్తుంది. కక్ష్యలో ఒక నిర్దిష్ట స్థలానికి వచ్చిన తరువాత వేగం తగ్గించే రెట్రో ఇంజన్ పని చేయటం ప్రారంభిస్తుంది. దానితో దాని వేగం, ముందుగా లెక్కవేసిన ఒక నిర్దిష్ట ప్రమాణం తగ్గుతుంది. అప్పుడు నౌక క్షేపరేఖా యాత్రలో రెండో భాగమయిన పతనరేఖ వెంబడి కిందికి దిగుతుంది.

భూమి చుట్టూ ఆవరించుకుని వున్న వాయుమండలంలో పైలట్




అంతరిక్ష నౌక 'వోస్తోక్' ప్రయాణించిన మార్గం

కోశం కిందికి దిగే వేగం, అంతకంతకీ తగ్గిపోతూ వుంటుంది. వేగం తగ్గటంవల్ల వచ్చే అపాయం, మనుష్యుడు తట్టుకునేందుకు వీలయిన పరిమాణానికి లోపలే వుండేట్లుగా, పతన రేఖని నిర్ణయిస్తారు. పైలట్ కోశం

ఒక నిర్ణీత ఎత్తువరకూ వచ్చిన తరవాత, భూమికి దిగే సాధనాలు పని చేయటం ప్రారంభిస్తాయి. భూమిని తాకేటప్పుడు, దాని వేగం చాలా తక్కువగా వుంటుంది. రెట్రో ఇంజన్ పని చేయటం మొదలు పెట్టిన దగ్గరనుంచి భూమికి దిగేవరకూ, అంతరిక్ష నౌక దాదాపు 8 వేల కిలో మీటర్ల దూరం ప్రయాణం చేస్తుంది. మొత్తం కిందికి దిగటానికి దాదాపు 30 నిమిషాలు పడుతుంది.




రోదసీ నౌక చోదకుని కోశం లోపలి దృశ్యం.

1. చోదకుని కంట్రోల్ పానెల్;
2. భూగోళంలో పరిసరాల ఒత్తు:
3. టెలివిజన్ కెమెరా;
4. చూడటానికి వీలునిచ్చే కంత:
5. మాన్యువల్ ఓరియంటేషన్ కంట్రోల్ లెవర్;
6. వైర్లెస్ సెట్టు:
7. ఆహార పాత్రలు.

పైలట్ కూర్చునే కోశం దట్టమైన గాలి పొరల్లోనుంచి ప్రయాణం చేస్తున్నప్పుడు రాపిడికి మండిపోకుండా దాన్ని కాపాడేందుకు ఒక ప్రత్యేక

మయిన తొడుగు దానికి అమరుస్తారు. ఆ తొడుగుకి మూడు కిటికీ కంతలూ, కావాలంటే చప్పున తెరుచుకునే తలుపులు రెండూ వుంటాయి. కిటికీ కంతలకి వేడిని తట్టుకునే గాజు పలకలు అమర్చటం వల్ల, పైలట్ దారి పొడుగునా పరీక్షలు జరిపే అవకాశం వుంటుంది.

అవసరమయితే, వెంటనే, అంతరిక్ష నౌకలోనుంచి పైలట్‌ను కుర్చీతో సహా బయటికి విసిరి పడేసే ఏర్పాట్లు వుంటాయి. ప్రయాణం పొడుగునా, అతను అందులో కూర్చునే వుంటాడు. నౌక పరిధిలో ప్రవేశించేటప్పుడూ, కిందికిదిగేటప్పుడూ ఏర్పడే ఒత్తిడీ మొదలైనవి పైలట్‌కి అత్యంత అనుకూలంగా వుండేట్లు—అంటే వెల్లకిలా వుండేట్లు—ఆ కుర్చీని అమరుస్తారు.

మొదటిసారి అంతరిక్ష యాత్ర చేసిన పైలట్, ఏ కారణం వల్ల నయినా అతడు కూర్చునే పెట్టెలో గాలి బయటికి వెళ్ళే ప్రమాదం ఏర్పడితే, అతడి ప్రాణం కాపాడేందుకు, ప్రత్యేకమయిన నివాత కవచం వంటిది ధరించాడు.

అంతరిక్ష నౌకలో యింకా యీ కింద పేర్కొన్న యంత్రాలు కూడా వున్నాయి :

—జీవ ప్రక్రియలు సరిగా సాగేందుకు కావలసిన ఏర్పాట్లు (సుఖోష్ణ పరిస్థితి నిలబెట్టే యంత్రం, ఒత్తిడి నిలబెట్టే యంత్రం, ఆహారం, నీరూ; శరీరం విసర్జించే పదార్థాలని తొలగించే ఏర్పాట్లూ).

—నౌకా గమనాన్ని అదుపులోవుంచే యంత్రాలూ, పైలట్ చేర్తో పనిచేయించే యంత్రాలూ (పైలట్ ఎదురుగా, వివిధ విషయాలూ తెలిపే బల్లా, వివిధ యంత్రాల మీటలూ, చేర్తో పని చేయించే మీటలూ).

—నౌక భూమిమీదికి దిగేందుకు కావలసిన సాధనాలూ.

—భూమితో సంబంధాలకోసం రేడియో యంత్రాలూ.

—వివిధ యంత్రాలూ చేస్తున్న పనిని గమనిస్తూ వుండే స్వయం చాలక ఏర్పాట్లూ, వివిధ పరిస్థితులనీ కనిపెట్టే సాధనాలూ, సమాచారాన్ని భూమిమీదికి అందజేసే ప్రసార సాధనాలూ.

—భూమి మీదనుంచి పైలట్‌ని గమనిస్తూ వుండేందుకు టెలివిజన్ ప్రసార యంత్రం.

—పైలట్ శరీర పరిస్థితుల్ని రికార్డుచేసే యంత్రాలూ.

—నౌక వేగాన్ని తగ్గించే రెట్రో-ఇంజన్.

—నౌక ఎటువెళ్ళాలంటే అటు తిప్పే యంత్రాలూ.

—నౌక ప్రయాణ పరిస్థితుల్ని అదుపులో వుంచే యంత్రం.

—పరిధికి సంబంధించిన అంశాలని కొలిచే యంత్రాలూ.

—ఉష్ణోగ్రతని అదుపులో వుంచే యంత్రాలూ.

—యంత్రాలకి కావలసిన విద్యుచ్ఛక్తి సప్లయిచేసే సాధనాలూ.

అంతరిక్ష నౌక వెలుపల పైపున, ప్రయాణాన్ని అదుపులో వుంచే సాధనాలూ, దారిచూపే సాధనాలూ, ఉష్ణోగ్రతని అదుపులో వుంచే తెరలూ, రేడియో ప్రసారక యంత్రాలు "ఆంటెన్నా"లూ వుంటాయి.

అంతరిక్ష నౌకలో పైలట్ కోశం వైశాల్యం విమానాల్లో పైలట్ కూర్చునే గదికన్నా ఎక్కువగా వుంటుంది. ప్రయాణంలో పైలట్‌కి అంతా అతి సదుపాయంగా అందుబాటులో వుండేట్లు అన్ని సాధనాలనీ అమరుస్తారు. తన కుర్చీమీదనుంచే అతను పరిశీలన, భూమితో సంభాషణ, ప్రయాణ పరిస్థితుల్ని అదుపులో వుంచటం, మొత్తం నౌకనే పూర్తిగా తన అదుపులో వుంచుకోటం—ఇవన్నీ చేయగలడు.

పైలట్ కుర్చీలో ఈ కింది భాగాలు వుంటాయి.

కుర్చీనుంచి విడదీయటానికి వీలయిన కుర్చీ పీఠం: పైలట్‌తో సహా దాన్ని బయటికి విసిరి, పారాచూట్లను పని చేయించేందుకు సాధనాలూ;

అతన్ని పట్టివుంచే సాధనాలూ, పారాచూట్ సాధనాలూ;

పైలట్‌ని విసిరి బయట పడేసే సాధనాలూ, దాణాసంచి సాధనాలూ;

—అవాంతర పరిస్థితులకి కావలసిన ఆహారం, నీరూ, భూమిమీదికి దిగిన తరవాత దారి తెలుసుకునేందుకూ, సమాచారాలు పంపేందుకూ సాధనాలూ;

—అంతరిక్షంలో ఉపయోగించే ప్రత్యేక కవచం మరీ పేడెక్కకుండా వుంచే సాధనాలూ;

—కుర్చీని పనిచేయించే స్వయంచాలక పరికరాలూ.

పైలట్ తను కూర్చునే కోశంతో సహా, భూమిమీదికి దిగవచ్చు. సోవియట్ దేశం పంపిన నాలుగో అంతరిక్ష నౌకలోనూ, అయిదో అంతరిక్ష నౌకలోనూ పరీక్షార్థం జంతువుల్ని పెట్టి పంపినప్పుడు, ఈ విధంగా కిందికి దిగే పద్ధతిని పరీక్షించటం జరిగింది. పెట్టెతో సహా దిగటంపోయి నట్లయితే, ఏడు కిలోమీటర్ల ఎత్తులో వున్నప్పుడు, కుర్చీలోనుంచి అతన్ని పెట్టెలోనుంచి బయటికి విసిరివేసి, పారాచూట్ ద్వారా కిందికి దింపే ఏర్పాట్లుకూడా వున్నాయి. ఈ పద్ధతినికూడా పరిధి నౌకలని దించేటప్పుడు పరీక్షించటం జరిగింది.

అంతరిక్ష నౌకలో గాలి ఒత్తిడినీ, గాలిలో వుండే ప్రాణవాయువునూ, సాధారణ పరిమాణంలో వుంచే యంత్రాలు వున్నాయి. నూటికి ఒక పాలుకి మించి బొగ్గుపులుసు గాలి చేరకుండానూ, ఉష్ణోగ్రత 15 మొదలు 22 సెంటిగ్రేడ్ డిగ్రీల వరకు ఉండేట్లూ, నీటి ఆవిరి 30 నుంచి 70 పాళ్ళ వరకూ వుండేట్లూ చూసే సాధనాలు వుంటాయి. పైలట్ గాలి పీలుస్తూ, వదులుతూ వున్నా, అందులో అన్నీ కావలసిన పాళంగా వుండేట్లు చేయటం కోసం, కొన్ని రసాయనిక పదార్థాలు వుంచుతారు. అవి బొగ్గు పులుసు గాలినీ, నీటి ఆవిరినీ పీల్చివేస్తూ, ప్రాణవాయువును పంపుతూ, పనిచేస్తాయి. ఒకవేళ ప్రాణవాయువు తగ్గిపోయి, బొగ్గుపులుసు గాలి ఎక్కువయిపోతే, ఒక ప్రత్యేక గ్రాహక యంత్రం ఆ విషయాన్ని కనిపెట్టి, ఆ లోపాన్ని సవరించే పద్ధతిలో మిగతా పరికరాలని నడిపిస్తుంది. ప్రాణవాయువు ఎక్కువైనట్లయితే మరొక గ్రాహక యంత్రం ప్రాణవాయువు సప్లయిని తగ్గిస్తుంది. గాలిలో చెమ్మకూడా ఈ విధంగానే అదుపులో వుంటుంది.

పైలట్ జీవ ప్రక్రియలవల్ల కానీ, యంత్రాలు పనిచేయటంవల్ల కానీ, అపాయకరమయిన పదార్థాలు గాలిలో కలిస్తే, గాలిని శుభ్రపరిచేందుకు ప్రత్యేకమయిన వడపోత యంత్రాలుకూడా వుంటాయి. ఉష్ణోగ్రతలని అదు

పులో వుంచేందుకు ప్రత్యేక సాధనాలు వుంటాయి. పైలట్ కోశంలో నుంచి ఎక్కువగా వున్న వేడిని ఇవతలికి తీసుకువచ్చేందుకు ఒకే ద్రవాన్ని ఉప యోగిస్తారు. ఇది ఆ వేడిని తీసుకుని ద్రవవాయువు రేడియేటర్ ద్వారా వెళ్ళి చల్లబడి, ఒకే ఉష్ణోగ్రత దగ్గర కోశాన్ని వుంచుతుంది. వేడిని బట్టి, రేడియేటర్ ద్వారా యీ ద్రవం ప్రవహించటం మారుతూ వుంటుంది. అందువల్ల వేడిని వుండవలసినట్లే నిక్కచ్చిగా వుంచటం వీలవుతుంది.

ఈ చల్లపరిచే ద్రవాన్ని సరైన ఉష్ణోగ్రతలో వుంచి, యంత్ర పరిక రాల దగ్గరకూడా సరైన ఉష్ణోగ్రత వుంచేందుకు, అంతరిక్ష నౌక వెలుపల వైపు అమర్చిన తెరలూ మొదలైనవాటితో, ఒక స్వయంచాలక ఉష్ణ వినిమయ సాధనం వుంటుంది.

భూమిమీద ఒక నిర్ణీత ప్రాంతంలో అంతరిక్ష నౌకను దించాలంటే, వేగం తగ్గించే రెట్రో ఇంజన్‌ని నడపించటానికి ముందుగా, అంతరిక్షంలో దాన్ని సరైన చోటికి వచ్చేటట్లు మార్గదర్శక యంత్రాలతో ఏర్పాట్లు చేయాలి. 'ఓస్తోక్'లో ఆ నౌక అక్షాల్లో ఒకటి సూర్యుడిని పట్టివుండేట్లుగా అమర్చారు. కొన్ని దృగ్యంత్రాలూ, గైరోస్కోప్‌లూ కలిసి, సూర్యుడి ఉనికిని గమనించి, దాని ప్రకారం నౌక అక్షాన్ని—అంటే నౌకని—తిప్పేం దుకు, కొన్ని విద్యుద్యంత్రాలకి ఆదేశాలిస్తాయి. వాటి ప్రకారం అంతరిక్ష నౌకని కావలసిన చోట అతి నిక్కచ్చిగా వుంచటం వీలవుతుంది.

నౌకని అంతరిక్షంలో అనుకూల ప్రదేశానికి తెచ్చిన తరవాత, నిర్ణీత సమయానికి, రెట్రో ఇంజన్ పని చేస్తుంది. నౌకని అంతరిక్షంలో కావల సిన స్థలానికి తీసుకురావటం, రెట్రో ఇంజన్‌ని పని చేయించటం, మొద లైన వన్నీ ఎలక్ట్రానిక్ సాధనంతో ఒక నిర్ణీత కార్యక్రమం ప్రకారం జరుగుతాయి.

పరిధికి సంబంధించిన కొలతలు తీసుకుని, పరికరాలు సరిగా పని చేసేట్లు చూసేందుకూ, ఆ సమాచారాన్ని భూమికి అందజేసేందుకూ కూడా అంతరిక్ష నౌకలో పరికరాలు వుంటాయి. అంతరిక్ష నౌక పంపే సమాచారా లని సేకరించేందుకూ, అది ప్రయాణం చేసేటప్పటి క్షేపరేఖని కొలిచేం

దుకూ, భూమిమీద, సోవియట్ దేశంలో కొన్ని స్థావరాలు వున్నాయి. అందే సమాచారాలు ఎప్పటికప్పుడే వాటిని పరిశీలించి లెక్కలుకట్టే కేంద్రాలకు వాటంతట అవే తీగెలద్వారా వెడుతూ వుంటాయి. అక్కడ ఎలెక్ట్రానిక్ యంత్రాలు ఆ వివరాలని లెక్కలుకట్టి, నౌక పరిధిలో ఎక్కడ వున్నదీ అప్పటికప్పుడు తెలియజేస్తూ వుంటాయి. దీనివల్ల, ఇకముందు ఆ నౌక ఎక్కడ వుంటుందో ముందే చెప్పటానికి కూడా వీలవుతుంది.

అంతరిక్ష నౌకలో సెకండుకి 19.995 మెగా సైకిల్స్ (ఫ్రీక్వెన్సీ మీద —అంటే 19,995 కిలోసైకిల్స్—పనిచేసే రేడియో సిగ్నల్ యంత్రం కూడా వుంది. ఈ యంత్రాన్ని దారి తెలుసుకునేందుకూ, అంతరిక్షంలో సేకరించిన సమాచారం కొంత పంపించేందుకూ ఉపయోగిస్తారు.

ఇందులో అమర్చిన టెలివిజన్ ప్రసార యంత్రంవల్ల పైలట్ ప్రతిబింబం భూమిమీద కనిపిస్తూ వుంటుంది. అందువల్ల, అతడి దేహ పరిస్థితి ఏ విధంగా వుందో, కిందివాళ్ళు కళ్ళతో చూసి తెలుసుకోటం వీలవుతుంది. ఒక టెలివిజన్ కెమేరా పైలట్‌ని ఎదురునుంచీ, మరొక కెమేరా పక్కనుంచీ చూపిస్తుంది. పైలట్ భూమిమీద వున్నవాళ్ళకి సమాచారం పంపి, వారి ఆదేశాలు తెలుసుకునేందుకు రేడియో-టెలిఫోన్ ఏర్పాట్లు వున్నాయి. అవి షార్ట్‌వేవ్ మీదా (9.109 మెగా సైకిల్స్, 20.006 మెగా సైకిల్స్), అల్ట్రా షార్ట్‌వేవ్ మీదా (143.625 మెగా సైకిల్స్) పని చేస్తాయి.

ఎఫ్-ఎం. చానల్‌ని భూమిమీద 1500 మొదలు ఒక కిలోమీటర్ల దూరాన వుండే కేంద్రాలతో సంబంధాలు నెలకొల్పేందుకు ఉపయోగిస్తారు. షార్ట్‌వేవ్‌మీద అయితే, సోవియట్ యూనియన్‌లో వున్న స్థావరాలు అంతరిక్ష నౌకతో, అది తన పరిధిలో అత్యధిక భాగంలో సంచరిస్తున్నప్పుడు, సంబంధాలు పెట్టుకోవచ్చునని పరీక్షలవల్ల తెలిసింది.

రేడియో-టెలిఫోన్ ఏర్పాట్లలో ఒక టేప్ రికార్డర్ కూడా వుంది. అంతరిక్షంలో ఎగురుతూవున్నప్పుడు పైలట్ చెప్పేదాన్ని యీ యంత్రం రికార్డుచేసి, అంతరిక్ష నౌక భూమిమీది స్థావరాలమీదుగా వెడుతున్నప్పుడు,

ఆ సమాచారాన్ని ప్రసారం చేస్తుంది. ఇదికాక టెలిగ్రాఫ్ పద్ధతిలో సమాచారాలు పంపేందుకు పైలట్ దగ్గర వేరే సదుపాయాలు చేశారు. పైలట్ దగ్గర, వివిధ యంత్రాలూ పని చేస్తున్న తీరు తెలియజేస్తూ, వాటిని అదుపులో వుంచే మీటలు అమర్చారు. అవసరమయితే, పైలట్ తనే స్వయముగా మీటనొక్కి యంత్రాలని పని చేయిస్తూ, అంతరిక్ష నౌకని కిందికి దింపే ఏర్పాట్లు కూడా పైలట్‌కి అందుబాటులో వున్నాయి. అక్కడ అనేక డయళ్లూ, లైట్ సిగ్నల్సూ, ఎలక్ట్రిక్ గడియారం, ఒక భూగోళం మొదలైనవి వున్నాయి. ఈ భూగోళం అంతరిక్ష నౌక గమనాన్ని పట్టి తిరుగుతూ వుంటుంది. దీన్ని చూసి, తాను ఎక్కడ వున్నదీ పైలట్ తెలుసుకుంటాడు. పైలట్‌కి ఎదురుగా డాష్-బోర్డుమీద, రేడియో టెలిఫోన్ మీటలూ, ఉష్ణోగ్రత సరిచేసే యంత్రాల మీటలూ, నౌకని స్వయంగా నడిపించటానికి కావలసిన మీటలూ, వేగంతగ్గించే ఇంజన్ మీటలూ వుంటాయి.

అంతరిక్ష నౌక రూపురేఖల్ని తీర్చేటప్పుడు, ప్రయాణం సురక్షితంగా సాగేందుకు ప్రత్యేక జాగ్రత్త తీసుకున్నారు. మొదటి సోవియట్ అంతరిక్ష నౌకల పరీక్షలవల్ల, వాటిల్లో యంత్రాలూ, పరికరాలూ కూడా ఎంతో నమ్మకంగా పనిచేస్తున్నట్లు ధృవపడింది. అయినాకూడా, 'వోస్తోక్' అంతరిక్ష నౌకలో, ప్రమాదావకాశాలని తొలగించి, మనుష్యుడు సురక్షితంగా తిరిగివచ్చే హామీ వుండేందుకు, ఎన్నో అదనపు ఏర్పాట్లు చేశారు. మనుష్యుడు నిర్భయంగా విశ్వాంతరాళంలోకి చొచ్చుకుపోగల నౌకలని పెంపొందించాలన్న ప్రాతిపదిక కర్తవ్యానికి యీ పైఖరి అనుగుణంగానే వుంది.

పైలట్ తానే స్వయంగా యంత్రాలని నడిపిస్తూ నౌకని కావలసిన చోటికి తీసుకువెళ్ళేందుకు దృక్‌సాధనాలని ఉపయోగిస్తాడు. ఈ దృక్ యంత్రాన్ని అంతరిక్ష నౌకకివుండే కిటికీ రంధ్రల్లో ఒకదానికి అమరుస్తారు. ఇందులో చదునుగావుండే వుంగరాల మోస్తరు వున్న అద్దాలు రెండూ,

ఒక లైట్-ఫిల్టర్, గాజు జల్లెడ ఒకటీ వుంటాయి. దిగ్మండల పరిధి మీద నుంచి వచ్చే కాంతి కిరణాలు మొదటి అద్దంలోపడి, కిటికీ రంతలో గుండా లోపలకి ప్రతిఫలిస్తాయి. అక్కడనుంచి ఆ కిరణాలు రెండో అద్దంమీద పడి, గాజు జల్లెడలో గుండా, పైలట్‌కి కనిపిస్తాయి. ఊర్ధ్వరేఖని పట్టి చూసినప్పుడు అంతరిక్ష నౌక సరిగా ఉన్నట్లయితే, దిగ్మండలం ఒక ఉంగరం మోస్తరు పైలట్‌కి కనిపిస్తుంది.

కిటికీ రంత మధ్యలోనుంచి పైలట్‌కి, సరిగ్గా తనకి కిందుగా వున్న భూమి కనిపిస్తుంది. ఈ విధంగా కనిపించే భూమి 'మార్గాన్ని' పట్టి, అంతరిక్ష నౌక ముఖం యెటువుందీ, నౌక వెడుతున్న దిక్కూ—వీటిని పైలట్ తెలుసుకోగలుగుతాడు.

గాజు జల్లెడమీద భూమి మార్గం వేసివుంటుంది. పైలట్ అంతరిక్ష నౌకని తిప్పి, దిగ్మండల పరిధి అద్దాల్లోనుంచి ఉంగరం మోస్తరు కనిపించేట్లూ, భూగమనం దిక్కు గాజు జల్లెడ మీద వేసిన దాంతో ఏకీభవించేట్లూ, చేస్తాడు. నౌక సరిగా దారిలో వెడుతున్నదనటానికి యిదే నిదర్శనం. మరీ వెలుగు యెక్కువగా వుంటే, పైలట్ కంటికి కనిపించే ప్రాంతానికి ఫిల్టర్‌కానీ, తెరకానీ వేయవచ్చు.

పరికరాల మీటల దగ్గర అమర్చిన భూగోళం వల్ల, అంతరిక్ష నౌక ఎగురుతున్నప్పుడు ఎక్కడవున్నదో తెలుసుకోటమే కాకుండా, ఎక్కడ బ్రేకువేస్తే భూమిమీద ఎక్కడ దిగవచ్చో కూడా తెలుసుకోవచ్చు. ఒక వేళ, యీ విధంగా వేగం తగ్గించే యంత్రాలు చెడిపోయినా కూడా, సహజంగావుండే గాలి రాపిడి వల్లనే అంతరిక్ష నౌక భూమిమీదికి దిగేందుకు, ఆ నౌక రూపురేఖలవల్ల అవకాశం వుంది.

పదిరోజుల ప్రయాణానికి సరిపడే ఆహారం, నీరూ, గాలిని శుద్ధి చేసే రసాయనాలూ, విద్యుచ్ఛక్తి సప్లయీ అమరుస్తారు.

వాతావరణం వల్లనే నౌక వేగం క్రమంగా తగ్గుతూ వుండే పరిస్థితుల్లో పైలట్ కోశంలో వేడి ఒక నిర్దిష్ట ప్రమాణం మించకుండా వుంచేందుకు అనువైన పద్ధతిలో, అంతరిక్ష నౌక రూపాన్ని తీర్చారు.

# అంతరిక్ష యాత్రలో వైద్యశాస్త్ర, జీవశాస్త్ర సమస్యలు

అంతరిక్షంలో మానవుడు సంచరించటానికి గల అవకాశాలనూ, వైద్య విషయంలో దానికి భద్రత సమకూర్చటం—ఈ సమస్యలని పరిష్కరించేటప్పుడు యీ కింది అంశాలు అవసరమయినాయి :

(1) అంతరిక్షయానం చేసేటప్పుడు సందర్భపడే వివిధాంశాలకూ జీవరాశిమీద వుండే ప్రభావాన్నీ, వీటివల్ల రాగల దుష్ఫలితాలనుంచి కాపాడేందుకూ కావలసిన సాధన సంపదలనూ పరిశీలించటం.

(2) అంతరిక్ష నౌకలో వుండే పైలట్ కోశంలో మనుష్యుడు జీవించటానికి కావలసిన సాధారణ పరిస్థితులని నెలకొల్పే పద్ధతులని సాధ్యమైనంతగా పెంపొందించటం.

(3) వైద్యశాస్త్ర దృష్టితో, అంతరిక్ష నౌకలలో సిబ్బందిగా వుండగలవారిని యెంచుకోటానికీ, వారికి శిక్షణ యివ్వటానికీ కొన్ని పద్ధతులని రూపొందించటం; అంతరిక్షయానం జరుగుతున్నంతసేపూ, నావికుల ఆరోగ్యం, శక్తిసామర్థ్యాలూ దెబ్బలినకుండా వుండేట్లు అవిచ్ఛిన్నంగా కనిపెట్టివుండే వైద్యపద్ధతులని రూపొందించటం.

ఈ అంశాల్లో ప్రతిదాంట్లోనూ అనేక విశిష్ట సమస్యలు ఇమిడి వున్నాయి. ఈ సమస్యలని పరిశీలించి, పరిష్కరించేందుకు పదేళ్ళనుంచీ శారీరక శాస్త్రం, ఆరోగ్యశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, జీవశాస్త్రం, చికిత్సా శాస్త్రం, వైద్యశాస్త్రం—వీటిల్లో నిపుణులు నిరంతరం కృషిచేస్తున్నారు. భూమిమీదా, రాకెట్లలో ఎగురుతున్న జంతువులమీదా పరిశోధనలు జరిగాయి. శారీరక శాస్త్రంలోనూ, వైద్యశాస్త్రంలోనూ—ముఖ్యంగా విమానయానం, నీటి అడుగున ఈదటం—వీటికి సంబంధించిన వైద్య విషయాల్లో సేకరించిన అమూల్యానుభవాన్ని ఉపయోగించుకోటం జరిగింది.

అంతరిక్షయాన ప్రభావం జీవరాసిమీద ఏ విధంగా వుంటుందో పరిశోధనాగారాల్లో పరిశీలించేందుకు అవకాశంవున్న చోటల్లా, స్థావరాలు నెలకొల్పటం జరిగింది. జీవరాసిమీద వివిధరకాలైన ఒత్తిడి ప్రభావం, ఈ ఒత్తిడికి జీవరాసి ప్రదర్శించే ప్రతిక్రియా,—వీటిని సెంట్రిఫ్యూగల్ యంత్రాల్లో పరిశీలించటం జరిగింది. అంతరిక్ష నౌకలు ఉవ్వెత్తున పైకి లేస్తున్నప్పుడూ, మళ్ళీ కిందికి దిగుతున్నప్పుడూ తటస్థించే ఒత్తిడి వివిధ రూపాలూ యీ యంత్రాల్లో చాలావరకూ కనిపిస్తాయి.

అదేపనిగా కంపింపచేస్తూ వుండే వైబ్రో-స్టాండ్‌లనబడే యంత్రాలతోనూ, ఉష్ణోగ్రత, శూన్యత మొదలైనవి ఉండే ప్రత్యేక యంత్రాలతోనూ, జీవరాసిమీద యితర అంశాలకు **వుండే** ప్రభావాన్ని పరిశీలించటం జరిగింది. అయితే పరిశోధనాగారాల్లో జరిగే పరీక్షలవల్ల ఈ శక్తులు ఒక్కొక్కటే ప్రసరించినప్పటి ఫలితాలు మాత్రమే తెలుస్తాయి. నిజంగా రాకెట్‌లో వెడుతూవుండే యివన్నీ ఒకేసారి, ఒక్క పెట్టున వాటివాటి ప్రభావాలవి జీవరాసిమీద ప్రసరింపజేస్తాయి. ఇంతేకాదు; బరువులేకుండా వుండటం అనే ప్రభావం జీవరాసిమీద ఎట్లావుంటుందో తెలుసుకోటం పరిశోధనాగారాల్లో సాధ్యపడదు. అందువల్ల, 1951 నుంచీ రాకెట్ల సహాయంతో జరిపిన జీవశాస్త్ర పరిశోధలనవల్ల, జీవరాసిమీద అంతరిక్షయాన ఫలితాలు ఏ విధంగా వుంటాయో మనం పరిశీలించటం మరింత అందుబాటులోకి వచ్చింది.

రాకెట్లలో 450 కిలోమీటర్ల ఎత్తువరకూ వెళ్ళిన జంతువులమీద ఎన్నో డజన్ల పరిశోధనలు జరిగాయి. వీటి ఫలితంగా ఆయా జీవుల ప్రతిక్రియ ఏ విధంగా వుందీ, ఆయా జంతువుల—కుక్కలూ, సీమకుందేళ్ళూ, ఎలుకలూ, చుంచెలుకలూ—ప్రవర్తన ఎట్లావుందీ, సమగ్రమయిన వైజ్ఞానిక వివరాలు లభించాయి. ఈ జంతువులు ఎగురుతూ వుండగానూ, తరువాత విశ్రాంతి తీసుకుంటూ వున్న దీర్ఘకాలాల్లోనూ జాగ్రత్తగా జరిపిన పరీక్షల ఫలితంగా, జీవరాసులు వాతావరణం పైపొరల్లో రాకెట్లలో మెసు

రుతూ వుంటే ఏర్పడ్డ పరిస్థితులకి, సంతృప్తికరంగా తట్టుకో గలవని అభిప్రాయపడేందుకు అవకాశం యిచ్చాయి. అవి ఎగురుతూ వున్న సమయంలో వాటి శారీరక ప్రక్రియల్లో కనిపించిన కొన్ని మార్పులు వ్యాధులు కలిగించేటటువంటి మార్పులు కావు, తరచు, పరీక్ష పూర్తికాక ముందే అవి మాయమైపోయేవి; మళ్ళీ అవి కనిపించలేదు కూడా.

అయితే రాకెట్లలో ఎగిరే కాలం బహు స్వల్పం కనుక, దీర్ఘకాలం బరువు లేకుండా వుండడం, కాస్మిక్ కిరణ ప్రభావంవంటి ప్రధాన అంతరిక్షయాన ప్రభావాలని, తద్వారా తెలుసుకునే అవకాశం లేదు. అందువల్ల, 1957 నుంచీ కృత్రిమ ఉపగ్రహాలని జీవశాస్త్ర పరిశోధనలకోసం పంపటం సాధ్యం కావటమన్న అంశం, ఈ విషయంలో అతి ప్రధానమయిన ముందడుగు అని చెప్పవలసి వుంది.

ఇటువంటి మొదటి ప్రయోగం రెండో సోవియట్ స్పూత్నిక్‌లోనే జరిగింది. ఈ ప్రయోగం, రాకెట్లతో జరిపిన వెనకటి జీవ పరిశోధనల ఫలితాలనే ధృవపరిచింది. కేవలం ఎక్కువసేపు బరువులేకుండా వుండటం అంశం ఒక్కటే ప్రాతిపదిక జీవ ప్రక్రియలకి హాని చెయ్యదని మొదటి సారిగా నిరూపించబడింది.

సోవియట్ దేశం ప్రయోగించిన మొదటి అంతరిక్ష పరిధీనౌకల మీద కూడా జీవశాస్త్ర పరిశోధనలు కొనసాగించబడ్డాయి. ఈ వైద్య-జీవశాస్త్ర పరిశోధనా కార్యక్రమాల్లో అనేక కొత్త అంశాలుకూడా వున్నాయి. జీవులు దీర్ఘకాలం బరువులేకుండా వుండే పరిస్థితుల్లో వుండటం వల్ల కలిగే ఫలితాలను మరింత నిశితంగా, బాగా పరిశీలించటమే కాకుండా, మరొక ముఖ్య పరిశీలనకూడా జరిగింది. బరువులేని పరిస్థితుల్లో నుంచి విపరీతమైన ఒత్తిడి పరిస్థితుల్లోనే, మళ్ళీ వాటిల్లో నుంచి వీటిల్లోకీ మారుతున్నప్పుడు దేహ స్థితి ఏ విధంగా వుంటుందో, కాస్మిక్ కిరణాల ప్రభావం జీవరాసి మీద ఏమిటో, పరిశీలించటం కూడా జరిగింది.

ఇక ముందు జరిపే అంతరిక్ష యాత్రల్లో, మానవుడు జీవ ప్రక్రియలు

సాగేందుకు కావలసిన సాధారణ పరిస్థితులనీ నెలకొల్పే ఏర్పాట్లూ, అతన్ని సురక్షితంగా తిరిగి భూమిమీదకు తీసుకువచ్చే హామీ వుండేందుకు కావలసిన ఏర్పాట్లూ— ఇవి ఎంతవరకూ పని చేస్తున్నాయి? వాటిల్లో విశేషాలు ఏమిటి? అన్న అంశాలని పరిశీలించటం కూడా యీ కార్యక్రమంలో ఒక ముఖ్యభాగమే. ఈ పథకం ప్రకారం అత్యంత ప్రాథమిక జీవ పదార్థాలు మొదలుకుని, వెన్నెముక గల పై తరగతి జంతువులవరకూ, వివిధ రకాల జీవరాసులనీ మొదటి సోవియట్ అంతరిక్ష పరిధి నౌకల్లో పెట్టి వదిలారు.

వివిధ రకాల జంతువులనీ, మొక్కలనీ యీ పరీక్షల్లో వాడినందువల్ల అత్యంత వైవిధ్యంతో, అతి వివరంగా, వివిధ రకాల జీవ ప్రక్రియల మీద, అంతరిక్ష యాన ప్రభావం తెలుసుకోటం సాధ్యపడింది. అంతరిక్షంలో ఎగురుతూవున్న సమయాల్లో ప్రయోగాలకి ఉపయోగించిన కుక్కల ప్రవర్తనకూ, వాటి మానసిక కార్యకలాపాలకూ సంబంధించిన వివరాలు చాలా విశదంగా లభించాయి. అంతరిక్ష నౌకల్లో పంపిన జంతువుల ప్రవర్తనని టెలివిజన్ ద్వారా కనిపెట్టటం జరిగింది. ఈ సందర్భంలో సేకరించిన సమాచారం అంతాకూడా, జంతువులు ఎక్కువసేపు బరువు లేకుండావున్నా, అత్యధికమయిన ఒత్తిళ్ళకి లోనయినప్పటికీ, వాటి జీవ కార్యకలాపాలని పూర్తిగా నిలబెట్టుకోటమే కాకుండా, వాటి ప్రాథమిక జీవ ప్రక్రియల్లో వ్యాధికారక లక్షణాలేమీకూడా ఏర్పడనట్లు కనిపించింది. అంతరిక్ష యాత్రకి తరవాత దీర్ఘకాలం జరిపిన పరీక్షల్లోకూడా, ఆ జంతువులు మామూలుకన్నా ఏమీ భిన్నంగా లేనట్లు తేలింది.

అంతరిక్ష పరిధి నౌక పర్యటనలో తటస్థించే కాస్మిక్ కిరణాల ప్రభావము ఏమయినా వుంటుందేమో కనిపెట్టేందుకు మరీ ప్రత్యేకించి శ్రద్ధ తీసుకోటం జరిగింది. ఈ సమస్యని పరిష్కరించేందుకు అనేక పద్ధతులు అనుసరించారు. 'విద్యుత్పూరిత పదార్థ కణాలని ఉత్పత్తిచేసే కిరణాల ప్రభావం' అని చెప్పతగ్గ పరిస్థితులేమీ వాటిల్లో కనిపించ లేదు.

అంతరిక్ష పరిధీ నౌకలమీద జరిపిన వైద్య-జీవశాస్త్ర పరిశోధనల వల్ల అతిముఖ్యం, అత్యంత బాధ్యతాయుతం అయినటువంటి నిర్ణయాలు చేసుకోటం వీలయింది. భూమికి దగ్గర్లోవున్న కిరణ మండలాలకన్నా దిగువగా అంతరిక్ష పరిధీ నౌకల్లో సంచరించటం పై తరగతుల జంతువులకి నిరపాయకరమేనని తేలింది. ఈ పరిశోధనల ఫలితాలు, మనుష్యుడు నిరపాయకరంగా అంతరిక్ష యాత్రలు జరపటానికి సంబంధించిన సమస్యలు పరిష్కరించటంలో ఉపయోగించబడ్డాయి.

ఈ పరిశోధనలూ, పరిశోధనా కేంద్రాల్లో జరిగిన ప్రయోగాలూ— ఇవన్నీకూడా, అంతరిక్ష ప్రయాణం మానవుడి ఆరోగ్యానికి ప్రతికూలంగా వుండని వైజ్ఞానికులు అభిప్రాయ పడేందుకు దారితీశాయి.

మొట్టమొదట అంతరిక్ష యాత్ర జరపగల మానవుడు ఎవరంటే, తన కర్తవ్యపు మహత్తర ప్రాధాన్యత గుర్తించి, ఈ విశిష్ట సాహస కార్యాన్ని సాధించటంకోసం తన సర్వ శక్తుల్నీ, విజ్ఞానాన్నీ, బహుశా జీవితాన్నే అర్పించటానికి సిద్ధపడినవాడే అయివుండాలి. వేలకొద్దీ సోవియట్ పౌరులు — దేశ భక్తులూ, రకరకాల వయస్సులకీ, వృత్తులకీ సంబంధించిన వాళ్ళు — అంతరిక్ష యాత్ర చేయటానికి వాంఛ వ్యక్తపరిచారు. ఎంతోమంది దరఖాస్తుదార్ల నుంచి, శాస్త్రీయ పద్ధతుల ప్రాతిపదికమీద, అంతరిక్ష యాత్రికులని ఎంపిక చేసే బాధ్యత సోవియట్ శాస్త్రజ్ఞులకి అప్పగించబడింది.

అంతరిక్ష యాత్ర చేసేటప్పుడు మనుష్యుడు అనేక రకాల పరిసర ప్రభావాలకి (గమన వేగం పెరిగిపోవటం, బరువు లేకుండాపోవటం, మొదలైనవి) లోనవుతాడు. నాడీ మండలంమీదా, మనస్సుమీదా అతితీవ్రమయిన ఒత్తిళ్ళు పనిచేస్తాయి. అందువల్ల సకల మనోబలాన్నీ, శారీరక శక్తులనీ కూడ తీసుకోవలసి వస్తుంది. దీంతోపాటుగా, అత్యంత క్లిష్టంగా వుండే అంతరిక్ష యాన పరిస్థితుల్లో పని చేయగల సామర్థ్యం, సావధానంగా వుండి పరిస్థితులకి తగినట్లు నడుచుకోగల శక్తీ వుండాలి. అవసరమయితే, ఆ పరిస్థితుల్లో తానే అంతరిక్ష నౌకని నడిపించకలిగి వుండాలి. ఈ కారణాలన్నిటి

వల్లనే, అంతరిక్ష యాత్రికులకి ఆరోగ్యం, మానసిక స్థాయీ, పూర్వాపరాయా, పరిసరాలూ, సాంకేతిక నైపుణ్యం—ఇవన్నీ చాలా ఎక్కువగా కావలసి వుంది.

ఈ లక్షణాలన్నీ విమానాల పైలట్లలో చాలా ఎక్కువగా కూడి వుంటాయి. విమానం పైలట్‌గా పని చేయటంలో అతని నాడీ మండలానికీ, భావనా శక్తులకీ వున్న స్థైర్యం తెలిసిపోతుంది. మొదట అంతరిక్ష యాత్రలకు ఎంతో అవసరమైన మనోబలంకూడా తెలుస్తుంది.ముందుముందు, అంతరిక్ష యాత్రలకు వెళ్ళేవారిలో వైవిధ్యం విస్తరించక తప్పదు.

అంతరిక్ష యాత్రికులని ఎంచుకునేందుకు, ఆ విధంగా వెళ్ళటానికి కోరిక వెల్లడించిన అనేక మందితో సంభాషణలు జరిగాయి. వారిలో బాగా సన్నద్ధులైనవారిని జాగ్రత్తగా వైద్య పరీక్ష, మనస్తత్వ పరీక్ష చేశారు. వారి ఆరోగ్యం ఎట్లావుందో? ఏమైనా లోపాలు అంతర్గతమై వున్నాయా? అంతరిక్ష యానంలో తటస్థపడే ముఖ్య పరిస్థితులని తట్టుకోటంతో వారి శారీరక శక్తులకి తగిన స్తోమత వుందా? ఆ పరిస్థితుల ప్రభావానికి లోనయినప్పుడు వారి శరీరాలు ఏ విధంగా ప్రవర్తిస్తాయి?—ఈ అంశాలని తెలుసుకునేందుకు యీ పరీక్షలు జరిగాయి.

అనేక ఆధునిక జీవ రసాయనశాస్త్ర పద్ధతులూ, శారీరక, విద్యుత్-శారీరక, మనస్తత్వ శాస్త్ర పద్ధతులూ,—వీటితో పరీక్షించారు. శరీరావయవాలూ,మనస్సూ ఏ విధంగా పనిచేస్తాయో చూసి పరీక్షలు కూడా చేశారు. వీటివల్ల, వివిధ పరిస్థితులలోనూ (గాలి మరీ పలచబడిపోయిన పరిస్థితి గురించి ప్రత్యేకమయిన ఒత్తిడి గదుల్లోనూ, గాలి ఒత్తిడి అకస్మాత్తుగా మారిపోయే పరిస్థితులూ, ఒత్తిడి పెరిగినప్పుడు ప్రాణవాయువు యెంత పీల్చుకునేదీ, విపరీత వేగాలతో గిరగిరా తిప్పే సెంట్రిఫ్యూజ్ యంత్రాల్లో కూర్చోపెట్టి పరీక్షలు జరిగాయి) అవసరమయినప్పుడు ఉపయోగపడగల శక్తి, వారి శరీరాల్లో యెంతవరకూ ఇమిడివుందో అంచనా వేయటం సాధ్యమయింది.

విశేష జ్ఞాపకశక్తీ, ఉపాయం ఆలోచించగల శక్తీ, ఏకాగ్రదృష్టిని సులభంగా పరొార అంశంపైదికి మళ్ళించగల శక్తీ, సద్యఃస్ఫూర్తీ, ఆల స్యం అన్నది జరక్కుండా ఏ పనులయితే చేయాలో వాటినే అతి శీఘ్రంగా నిర్వహించే స్వభావా—ఈ లక్షణాలుగల వ్యక్తుల్ని ఎంచుకునేందుకు మన స్తత్వ పరీక్షలు జరిగాయి.

వైద్య పరీక్షలూ, శారీరక పరీక్షలూ జరిగిన తరవాత, ఒక బృందాన్ని ఎంచుకుని, అంతరిక్షయాన పరిస్థితుల్ని కల్పించే సాధనాలతో ప్రత్యేక శిక్షణ యిచ్చారు. దానితోపాటే, ఆయా పరిస్థితుల్లో ఆయా వ్యక్తుల విశిష్ట ప్రవర్తన కూడా తెలుసుకున్నారు.

అంతరిక్షయాత్రకి సంబంధించిన ప్రాథమిక శాస్త్రీయ విషయాలని గురించి వారికి తెలియజేసేందుకూ, అంతరిక్ష నౌకలో పైలట్ కోశంలో వుండే పరికరాలూ, యంత్రాలూ మొదలైన వాటిని ఉపయోగించటం అల వాటయ్యేట్లు చేసేందుకూ యీ ప్రత్యేక శిక్షణ యివ్వటం జరిగింది. రాకెట్ లకూ, అంతరిక్షానికీ సంబంధించిన సాంకేతిక శాస్త్రం, అంతరిక్ష నౌకల రూపురేఖల్ని గీయటం, ఖగోళ శాస్త్రం, పృథ్వీ భౌతిక శాస్త్రం, అంత రిక్షంలో ఆరోగ్యం కాపాడుకునే విషయం, మొదలైనవన్నీ, యీ శిక్షణ కార్యక్రమంలో వున్నాయి. ఈ ప్రత్యేక శిక్షణ కార్యక్రమంలోనూ, వారి మీద జరిపిన పరీక్షల్లోనూ యీ కిందివి కొన్ని :

భూమి ఆకర్షణ శక్తి ఏమీ లేకుండా వుండే పరిస్థితుల్లో విమానాల్లో ఎగరటం;

అంతరిక్ష నౌకలో వుండే పైలట్ కోశం మోస్తరే అమర్చిన చోట శిక్షణ ఇవ్వటం, ప్రత్యేకసాధనాలమీద శిక్షణ ఇవ్వటం;

బయటినుంచి లోపలకీ, లోపలనుంచి బయటికీ శబ్దం వెళ్ళకుండా ప్రత్యేక ఏర్పాట్లు చేసిన గదిలో దీర్ఘకాలం వుండటం;

సెంట్రిఫ్యూజ్ సాధనాలతో శిక్షణ;

విమానాల్లోనుంచి పారాచూట్‌లతో దూకటం.

ప్రత్యేక శిక్షణ సందర్భంలో అంతరిక్ష యాత్రచేసే మనుష్యులకి సంబంధించిన కొన్ని సమస్యలు—ముఖ్యంగా అంతరిక్షంలో ఎగురుతూ వున్న వ్యక్తికి ఆహారం ఇవ్వటం, అంతరిక్ష యాత్రలో తొడుక్కునే ప్రత్యేక కవచం, గాలిని శుద్ధిచేయటం అన్నవి—పరిష్కరించబడ్డాయి.

విమానాల్లో ఎగురుతున్నప్పుడే, బరువులేకుండా వుండే పరిస్థితి అందులోనుంచి విపరీతమయిన ఒత్తిడికి లోనుకావటం—వీటికి ఎవరెవరు ఏవిధంగా తట్టుకుంటున్నదీ కూడా పరిశీలించారు. రేడియో సంబంధాలని నడుపుతూ వుండేందుకూ, ఆహారం, నీరూ తీసుకుంటూవుండేందుకూ గల అవకాశాలు పరిశీలించారు. అంతరిక్ష యాత్రా పరిస్థితుల్లో మనుష్యుడు యే విధంగా ప్రవర్తిస్తాడో కొన్ని ముఖ్య ప్రశ్నలను యివి పరిష్కరించింది.

అంతరిక్ష యాత్రికులుగా ఎన్నికైన వారంతా కూడా భూ ఆకర్షణ శక్తి ఏమీలేని పరిస్థితులని బాగా తట్టుకోగలిగారు. బరువులేని పరిస్థితిలో 40 సెకండ్ల వరకూ ఉన్నప్పటికీ, మనుష్యులు మామూలుగానే ద్రవపదార్థం, అంతకన్నా కొంచెం గట్టి పదార్థాలూ, పూర్తిగా ఘన పదార్థాలూ కూడా తీసుకోగలరని నిరూపించబడింది. వ్రాయటం, చేతులతో ఏమయినా పనులు చేయటం, రేడియోలు పనిచేయించటం, చదవటం, దృక్ సాధనాల ద్వారా అంతరిక్ష నౌకని సరైన దారిలో పెట్టటం—మొదలైన పనులు కూడా వారు మామూలుగానే చేయగలరని తేలింది.

అంతరిక్ష నౌకలో పైలట్ కోశంవంటి దాంట్లోనూ, ప్రత్యేక సాధనాల్లోనూ శిక్షణ ఇవ్వటం అన్నది అంతరిక్ష యాత్రికులకి అందులో ఉపకరాలనూ, సాధనాలనూ తెలుసుకునేందుకూ, అంతరిక్ష యాత్రలో చెయ్యవలసిన పనులు అలవాటు చేసుకునేందుకూ, పైలట్ కోశంలో ఉండటం అలవాటు చేసుకునేందుకూ జరుగుతున్నది. నిజంగా అంతరిక్ష యాత్ర జరుపుతున్నప్పుడు అక్కడి పరిసరాల ప్రభావం వివిధ పరికరాల మీద ఏ విధంగా వుంటుందో, అటువంటి ప్రభావం యీ శిక్షణ కోశంలో అను

ర్చిన పరికరాల మీద పదేట్లు ఎలక్ట్రానిక్ పద్ధతిలో ఏర్పాట్లు చేశారు. అంతరిక్షంలో వున్నప్పుడు ఏ విధంగా వ్యవహరిస్తాడో, అదేవిధంగా ఇక్కడ కూడా పైలట్ వ్యవహరించాడు. అవాంతర పరిస్థితులని కూడా ఇదే విధంగా సృష్టించి, ఆ పరిస్థితుల్లో ఏ విధంగా వ్యవహరించాలో శిక్షణ యిచ్చారు.

ఇరుకుగా వున్న చిన్న గదిలో ఎంతోకాలం ఒంటరిగా, బయటి వాటితో ఏమీ సంబంధం లేకుండా వుండేటప్పుడు అంతరిక్ష యాత్రికుడి నాడీమండలం, మనస్సు—ఇవి ఎంత స్థిరంగా వుంటాయో పరిశీలించేందుకే, శబ్దం ప్రవేశించని ప్రత్యేక గదిలో, వారిని ఎక్కువకాలం వుంచి పరీక్షించటంలో ఉద్దేశం. ఈ శిక్షణతోపాటే అంతరిక్ష యాత్రికుడు ఆహారం తీసుకునే పద్ధతీ, నియమాలూ మొదలైన వాటిల్లో కూడా శిక్షణ ఇస్తారు.

శారీరక పరీక్షలూ, ప్రత్యేక మానసిక—శారీరక పరీక్షలూ జరిపిన మీదట, బుద్ధి నిశితత్వం, నిక్కచ్చిగా పనులని జరిపే నేర్పూ, బలమైన నాడీమండలం, మనస్సూ—వీటిల్లో ఉన్నతస్థాయిలో వున్నవారిని ప్రత్యేకించటం సాధ్యపడింది.

సెంట్రిఫ్యూగల్ యంత్రంమీదా, వేడిగదిలోనూ, జరిపిన పరీక్షల వల్ల ఆయా ప్రభావాలని వారు ఎంతవరకూ తట్టుకోగలరో తెలిసింది. ప్రాథమిక శారీరక ప్రక్రియల మీద వాటి ప్రభావమూ, బయటి పరిస్థితులు ఎట్లా వున్నా అవయవాలు ఎంతవరకూ దృఢంగా నిలబడగలిగేదీ, తేలింది. ఈ వివిధ పరిస్థితుల్లోనూ అంతరిక్ష యాత్రికులు చాలావరకూ స్థిరంగా వున్నట్లు తెలిసింది. అందులో అగ్రశ్రేణి వారిని ప్రత్యేకించటం జరిగింది.

విమానాల్లోనుంచి పారాచూట్లతో దిగటంలో శిక్షణ ఇచ్చేటప్పుడు, అనేక డజన్లసార్లు దూకవలసి వచ్చింది. వ్యాయామ శిక్షణలో ప్రతి ఒక్కరి శరీరానికీ తగినట్లు ప్రత్యేక శిక్షణలు యిచ్చారు. ఇవి కాక రోజూ ఒక గంటసేపు, శరీర పుష్టికోసం కసరత్తులు వున్నాయి. శిక్షణ విపరీత వేగా

లకి శరీరం బాగా తట్టుకునేటట్లు చేసేందుకూ, అంతరిక్షంలో వున్నప్పుడు శరీరంచేత సులువుగా, చక్కగా పని చేయించటం అలవరిచేందుకూ, దీర్ఘకాలంపాటు శారీరక శ్రమని తట్టుకునేట్లు చేసేందుకూ, యీ వ్యాయామ శిక్షణ యిచ్చారు.

వ్యాయామ శిక్షణ అన్నది ఎప్పుడూ వైద్యుల పర్యవేక్షణ కింద జరిగేది. కసరత్తులూ, ఆటలూ, నీళ్ళలోకి దూకటం, ఈత, ప్రత్యేక సాధనాల మీద కసరత్తులూ—ఇవన్నీ వ్యాయామ శిక్షణలో వుండేవి.

ప్రత్యేక శిక్షణ కార్యక్రమాలన్నీ పూర్తి అయిన తరవాత, అంతరిక్ష యాత్రకి ప్రత్యక్ష సన్నాహాలు ప్రారంభమయాయి. ఈ సన్నాహాల్లో యివి కొన్ని :

అంతరిక్ష యాత్రా కార్యక్రమాలనీ, భూమిమీదికి దిగవలసిన ప్రాంతాల పటాలనీ పరిశీలించి తెలుసుకోటం, అంతరిక్ష నౌకని నడిపించటం, రేడియోలని పనిచేయించటం.

అవాంతరాలకి ఉపయోగించే సామగ్రిని తెలుసుకోటం, భూమి మీదికి దిగినప్పుడు వాటిని ఉపయోగించే పద్ధతీ, దిక్కులు తెలుసుకునే పద్ధతులూ;

అంతరిక్ష కవచం వేసుకుని, ఆ యాత్రల్లో ఏర్పడగల అత్యధిక ఒత్తిడితో, సెంట్రిఫ్యూగల్ యంత్రం మీద శిక్షణా;

అపాయ సమయాల్లో ప్రాణరక్షణ సాధనాలన్నిటినీ అమర్చిన నమూనా నౌకలో దీర్ఘకాలం శిక్షణా:

ఈ పరీక్షలన్నీ అయిన తరవాత ఉత్తమశ్రేణి వ్యక్తుల్ని యెన్నుకోటం జరిగింది.

పైలట్‌గా వున్న మేజర్ యై. ఏ. గగారిన్‌ని యీ అంతరిక్ష యాత్రిక బృందంలోనుంచి, ప్రథమ యాత్ర జరిపేందుకు ఎన్నుకున్నారు.

ఈ విశిష్ట సోవియట్ వ్యక్తి యై. ఏ. గగారిన్ 1934 సంవత్సరం

మార్చి తొమ్మిదో తేదీన, సమిష్టి వ్యవసాయదారు కుటుంబంలో జన్మిం
చారు. చిన్నప్పటినుంచి పైలట్ కావాలనే కలలు కన్నారు. ఓరెన్‌బర్గ్
విమాన దళ పాఠశాలలో శిక్షణ పొంది, ఫైటర్ విమానం పైలట్‌గా
ప్రత్యేక నిపుణత సంపాదించి, యూ. ఏ. గగారిన్ సోవియట్ విమాన
దళంలో పనిచేశారు. ఆయన కోరికమీదే అంతరిక్ష యాత్ర అభ్యర్థుల్లో చేరి,
పరీక్షల్లో ఉత్తీర్ణుడయినాడు. శిక్షణ సమయంలో గగారిన్ అందరికన్నా
పైచెయ్యిగా వున్నారు.

యూరీ అలెక్సేయేవిచ్ గగారిన్ ప్రపంచపు ప్రప్రథమ అంతరిక్ష
యాత్రికుడు కాగలడన్న విశ్వాసం. పూర్తిగా సఫలమయింది.

# ప్రథమ అంతరిక్ష యాత్ర

అంతరిక్ష నౌక వోస్తోక్ 1961 వ సంవత్సరం ఏప్రిల్ పన్నెండో
తేదీన, మాస్కో కాలమానం ప్రకారం ఉదయం 9 గంటల పది నిముషా
లకు భూమిమీదనుంచి బయలుదేరింది.

రాకెట్లు అంతరిక్ష నౌకని పైకి తీసుకుపోతున్నంత కాలం పొడు
గునా, పైలట్ గగారిన్ రేడియో ద్వారా భూమి మీదవున్న కేంద్రంతో
సంబంధం వుంచుతూనే వున్నారు. ఈ ఘట్టం పొడుగునా ఆయన హాయి
గానే వున్నారు. ఒత్తిడిలో మార్పుల్ని, రాకెట్లు ఒకదాని తరవాత
ఒకటి విడిపోవటం—వీటిని ఆయన కచ్చితంగా రికార్డుచేశారు పైలట్
కోశంలో మోత మామూలు జెట్ విమానంలో పైలట్ కూర్చునే
చోట వుండే శబ్దానికి మించలేదు. అంతరిక్ష నౌక ఉప్పెత్తున పైకి వెళు
తున్నప్పుడుకూడా, గగారిన్ కిటికీ రంధ్రాల్లోనుంచి భూమిని చూస్తూనే
వున్నారు.

నౌక కక్ష్యలోకి ప్రవేశించిన తరవాత, నౌక దిగటానికి ముందు

దాన్ని నిర్ణీత స్థలానికి తీసుకురావటం, నౌక కిందికి దిగటం—ఈ పనులన్నీ వాటంతట అవే, స్వయంచాలకంగా, జరిగాయి. అయితే అవసరం ఏర్పడినా కానీ, భూమినుంచి ఆదేశం వచ్చినా కానీ, ఆయన స్వయంగా నౌకని నడిపించి, తాను ఎక్కడున్నదీ తెలుసుకుని, నిర్ణీత స్థలంలో నౌకని భూమికి దించేవారే.

అంతరిక్ష నౌక భూమిచుట్టూ తిరిగేందుకు పరిధిలో ప్రవేశించటంలో, బరువు లేకపోవటమనే పరిస్థితి ఏర్పడింది. మొదట్లో ఇది పైలట్ కి అపూర్వమయిన విషయమే కాని, వెంటనే దానికి ఆయన అలవాటుపడ్డారు. బరువు లేకుండా వున్నంతసేపూ కూడా వై. ఏ. గగారిన్ సుఖంగానే వున్నారు. తన శక్తి సామర్థ్యాలన్నిటినీ పూర్తిగా వశంలోనే వుంచుకున్నారు.

అంతరిక్ష యాత్రా కార్యక్రమం ప్రకారం, తనకిచ్చిన ఆదేశాలను బట్టి, ఆయన అంతరిక్ష నౌకలో వున్న వివిధ యంత్రాలూ, పరికరాలూ ఏ విధంగా పనిచేస్తున్నదీ గమనిస్తూనేవున్నారు. రేడియో-టెలిఫోన్ ద్వారానూ, టెలిగ్రాఫ్ ద్వారానూ భూమితో సంబంధం నిలబెట్టే వుంచారు. కిటికీ కంతల్లో నుంచీ, దృక్సాధనాల ద్వారానూ అన్నిటినీ పరిశీలిస్తూనే వున్నారు. తాను తెలుసుకున్న సమాచారం భూమిమీదికి పంపుతునే వున్నారు. తాను తెలుసుకున్న అంశాలని 'లాగ్-బుక్'లో రాస్తూనే వున్నారు. టేపుమీద రికార్డుకూడా చేశారు. ఆహారం, నీరూ, పుచ్చుకున్నారు.

300 కిలోమీటర్ల ఎత్తువరకూ భూమి పైభాగం అంతా స్పష్టంగా కనిపించింది. సముద్ర తీరాలూ, పెద్ద నదులూ, మిట్ట పల్లాలూ, అడవులూ, మేఘాలూ. మేఘాల నీడలూ—అన్నీ బాగా కనిపించాయి. మా సోవియట్ భూభాగం మీదుగా వెడుతున్నప్పుడు గగారిన్ సమిష్టి వ్యవసాయ క్షేత్రాల ఆకారాలని చూశారు.

ఆకాశం కారు నలుపుగా వుంది. భూమిమీదినుంచి చూసిన దాని

కన్నా, నల్లటి ఆకాశంలో నక్షత్రాలన్నీ చాలా ప్రకాశవంతంగా, స్పష్టంగా కనిపించాయి. భూమిచుట్టూ లేత నీలపు రంగులో పరివేష్టం ఒకటి ఆవరించు కుని వుంది. దిగ్మండలంలో రంగులు క్రమేపీ లేతనీలం మొదలుకుని సముద్రపు నీలం, ముదురు నీలం, వయొలెట్ ఛాయల్లోకి మారుతూ, చివరికి కటిక నలుపు ఆకాశంలో లీనమయాయి. నీడ చాటునుంచి ఇవతలకు వచ్చి నప్పుడు భూమి అంచు, మొదట్లో అతి గాఢమైన నారింజ రంగులో మెరిసి పోయింది. తరవాత క్రమేపీ, ఇంద్ర ధనస్సు రంగులన్నీ వరసగా కని పించాయి.

సరిగ్గా 9 గంటల 51 నిమిషాలకి అంతరిక్ష నౌకని నిర్దిష్ట స్థలానికి తీసుకువచ్చే స్వయంచాలక యంత్రాలు పనిచేయటం ప్రారంభించాయి. అంత రిక్ష నౌక భూమివల్ల ఏర్పడ్డ నీడలోనుంచి బయటికిరాగానే, ఈ యంత్రాలు సూర్యుని ఉనికిని పట్టి, నౌకని నడిపించాయి.

9 గంటల 52 నిమిషాలకు, దక్షిణ అమెరికా కొసలోవున్న కేప్ హారన్ అగ్రం మీదుగా ఎగురుతూ గగారిన్, తాను కులాసాగా వున్నట్లూ, నౌకలో పరికరాలన్నీ సరిగా పని చేస్తున్నట్లూ సందేశం పంపారు.

10 గంటల 15 నిమిషాలకు వేగం తగ్గించే రాకెట్‌ని పెట్టవలసిం దిగా స్వయంచాలక యంత్రాలు ఆదేశించాయి. అప్పుడు అంతరిక్ష నౌక ఆఫ్రికా ఖండంమీదికి వస్తూ వున్నది. గగారిన్ దగ్గరనుంచీ మరొక సందే శం అందింది.

10 గంటల 25 నిమిషాలకు బ్రేకింగ్ రాకెట్ పేలింది. అంతరిక్ష నౌక తన పరిధిలోనుంచి తటాలున జారి, పతనరేఖ వెంబడి భూమికి రావ టం ప్రారంభించింది. 10-35 నిమిషాలకు అంతరిక్ష నౌక వాతావరణంలో వున్న దట్టమైన గాలి పొరల్లోకి ప్రవేశించింది.

మాస్కో కాలమానం 10-55 కల్లా అంతరిక్ష నౌక 'వొస్తోక్'

ప్రప్రథమంగా మానవుడితో అంతరిక్ష యాత్ర జరిపి, నిర్ణీత స్థలంలో భూమి మీదికి దిగింది.

కిందికి దిగిన తరవాత గగారిన్ హాయిగానే వున్నారు. ఆయన ఆరో గ్యంలో ఎటువంటి లోపాలూ కనిపించలేదు.

మానవ చరిత్రలో మొదటిసారిగా, ఉపగ్రహ అంతరిక్ష నౌక 'ఓస్తోక్'లో, సోవియట్ అంతరిక్ష యాత్రికుడు గగారిన్ జరిపిన యీ యాత్ర మూలంగా, అంతరిక్షంలో మానవ సంచారం సాధ్యమేనన్న అమూల్య వైజ్ఞానిక నిర్ణయానికి దారితీసే ఫలితాలు లభించాయి. అంతరిక్ష యాత్రా పరిస్థితుల్ని, మనుష్యుడు సాధారణంగా తట్టుకో గలడని యీ యాత్ర నిరూపించింది. భూమినుంచి పరిధిలోనికి వెళ్ళటం, తిరిగి రావటం వీటినికూడా తట్టుకోగలడని నిరూపించింది. బరువులేని పరిస్థితుల్లో కూడా, మానవుడికి తన శక్తులన్నీ తన అధీ నంలోనే వుంటాయనీ, తను కావాలనుకున్న పద్ధతిలో శరీరాన్ని పని చేయించగలడనీ, నిశితంగా ఆలోచించగలడనీ, యీ యాత్ర నిరూ పించింది.

అంతరిక్ష నౌక నిర్మాణం, అందులో భాగాలూ, పరికరాలూ—ఇవి అంతరిక్షంలో ఏ విధంగా పనిచేస్తాయో అనే అంశాలమీదకూడా, అమూల్య విషయాలు తెలిశాయి. నౌక రూపురేఖలని తీర్చేటప్పుడు ఆధారంగా తీసు కున్న వైజ్ఞానిక, సాంకేతిక సూత్రాలు సరైనవని పూర్తిగా నిరూపించ బడ్డాయి. నౌకని అంతరిక్షంలోకి తీసుకుపోయే రాకెట్లు నమ్మకంగా పని చేస్తాయనీ, అంతరిక్ష నౌక రూపురేఖలు నిర్దుష్టంగా వున్నాయనీ ధృవ పడింది.

ఇంక మానవుడు అంతరిక్ష యాత్ర చేసేందుకు కావలసిన సాధనాలు మనకి వున్నాయి. మానవుడు జరిపిన యీ ప్రథమ అంతరిక్ష యాత్ర, మానవ చరిత్రలో అంతరిక్ష శకాన్ని ప్రవేశ పెడుతున్నది.

ఇదివరకు విపరీతంగా కనిపించిన వైజ్ఞానిక పథకాలను—భూమికి బయట అంతరిక్షంలో పరిశోధనా స్థావరాలు నెలకొల్పటం, చంద్రుడు, కుజుడు, శుక్రుడు మొదలైన గ్రహాలకి మానవులని పంపటం మొదలైన పథకాలను—సాధించే సమయం వచ్చింది.

మానవ చరిత్రలో యీ అంతరిక్ష శకం మానవ జీవితం, చరిత్రల మహత్తర విస్తృతికి చిహ్నం. ఇది సౌరాకాశంలో మానవ విజయాల శకం.




సోవియట్ స్పుత్నిక్కుల, రోదసీ నౌకల భారం రానురాను
అధికమవుతున్నదని తెలియజేసే పటం.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 101 B160 |
| పుస్తకం పేరు | గిరిజనుల సాహిత్యం [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI ,2 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | Nava |
| పరీక్ష చేసినది | thasin |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యిలివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |